# ఓం

# బ్రహ్మైక్యబోధ

శ్రీ మదచల గురుపీఠ వేదాంత గ్రంథము

రచయిత్రి :

శ్రీ శేషమాంబగారు

ఓం

# బ్రహ్మైక్యబోధ

శ్రీ మదచల గురుపీఠ వేదాంత గ్రంథము



రచయిత్రి :

శ్రీ శేషమాంబగారు

శుభం

శ్రీ సద్గురుభ్యోనమః

శ్రీ శ్రీ శ్రీ శివరామ దీక్షిత అచలగురు సాంప్రదాయిక

వేద వేదాంత గ్రంథము

ఇయ్యది

శ్రీమత్పరశురామ సీతారామ నరసింహ్మదాసులవారి సోదరియగు

# శ్రీ శేషమాంబగారిచే

రచియింపబడిన

# బ్రహ్మైక్య బోధ

ద్విపదలు, పరమ తత్వములు

శ్రీవారి శిష్య రత్నంబగు

శ్రీ ముద్దుముదెల్లి శారంగ ప్రభుప్పలవారి ప్రియ శిష్యులు

(పుత్రిలు) నగు గుముదెల్లి శ్రీ సాంబయ్య శ్రీ శివయ్యగార్లను

దేశికేంద్రులవారి శిష్య శ్రేణిలో నాకరగు

శ్రీ బాల్నాక్ వీరయ్య గౌంగూడ చమన్, హైద్రాబాద్‌గారి

ప్రోత్సాహముననేగాక ద్రవ్య సహాయమున

హైద్రాబాద్ కిసాన్ ప్రెస్‌నందు చతుర్థ ముద్రణ

1500 ప్రతులు 1990 జూన్

వెల :

# అవతారిక

శ్రీమత్ బృహద్వాశిష్ట సిద్ధాంత ప్రతిష్టాపనచార్యులని పేరొందిన । శ్రీ మద్రామడుగు శ్రీ శివరామ దీక్షితావల గురు సాంప్రదాయక మీనాడు। శాఖోపశాఖలుగా విస్తరించి యున్నది। అయినను వారి ప్రథమ శిష్యగణంబులలో నొకరగు। శ్రీ మత్కాం బాలూరప్ప బ్రహ్మంబనువారు। వారిచే శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహ్మదాసు శ్రీ సీతారామస్వాములవారు। శ్రీ సూరయ్య (సూర్యనారాయణ) యనువారలు । వారిలో శ్రీ సీతారామ స్వాముల వారికి । శ్రీ శేషమాంబగారు శ్రీ మద్భాగవత శ్రీ కృష్ణదేశికేంద్రులవారు। శ్రీ కృష్ణదేశికేంద్రుల వారికి । శ్రీ మత్పీఠ్యాన శంకర ప్రభువులు। శ్రీ లక్ష్మణ ప్రభువులవారు వీరుభయుల నివాస స్థానము । ప్రస్తుత మాంధ్ర రాజధానియగు హైద్రాబాద్ నగరము యీ నగరమున కంటియున్న సికింద్రా బాద్‌లో । వీరి శిష్యప్రశిష్యులు । వీరి పేర అనగా పీఠ్యాన లక్ష్మణ దేశికేంద్రులవారి అచల గురు మందిరము । గురు పీఠ స్థాపనము గావించి। వార్షికారాధనలు జయంత్యుత్సవాలు। పూర్ణ పూజలు। జరుపబడు చుండెడివి । అయితే శాఖోప శాఖలుగా విస్తరింపపడియున్న । శ్రీ శివరామదీక్షితావల గురు సాంప్రదాయక గురు బంధు జనులు ఇక్కడికి ఎక్కువ రావడము ఎందు వల్లననగా । యీ అచల పరిపూర్ణ గురు బోధ సిద్ధాంతార్థము

పండిత పామర జనుల సాక్షరింప జేయునట్లు శక్తిద్వయ నిరాస కంబైన శుద్ధ నిర్గుణతత్వ కేంద్రార్థదర్శ్యలుగా। నవరస మొలుకు కావ్య గ్రంథముగా రచియించినది। శ్రీ మద్భాగవత శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారగుటచే। యీ మహానుభావుడు నివసించినది। ఆయన శిష్యప్రశిష్య జనులెక్కువ మట్టుకు నివసించినది గూడ। హైద్రాబాద్ సికింద్రాబాద్లగు గొప్ప పట్టణములగుటచేత లవుకిక వ్యవహారార్థముల గురించి కొంత। గురు పీఠస్థాన దర్శ। నార్థమై కొంత అచ్చటి గురుబంధు జనులను కలుసుకొనవలయు నను ఆశయముతో। అక్కడికి పలు ప్రాంతములనుండి। సాంప్ర దాయకులెక్కువ। వచ్చుచుండుట వలన అదియొక గురుకుల కేంద్రస్థాన మనిపించినది। అయితె శ్రీ శేషమాంబ శాఖకు చెం దిన శిష్యప్రశిష్యులున్ను గురువులు గురుపుత్రులున్ను మద్గురు భక్త బృందములతో నేనున్నుగూడ ముప్పది సంవత్సరముల నుండి అక్కడికి అప్పుడప్పుడు జరుగు గురుపూజాది కార్య క్రమముల గురించి పోవుచు వచ్చుచుండుట వలన। స్థానిక గురు సాంప్రదాయకులే గాక పలు ప్రాంతముల గురు సాంప్రదాయ కులు। గురు సమస్వరూపుల దర్శన స్పర్శన భాగ్యము కలుగు చుండెడిది। కాని శ్రీ శేషమాంబగారి ప్రియశిష్యుండైన శ్రీమత్ గుమ్మడెల్లి భారలింగ ప్రభువుల వారి। శిష్యప్రశిష్యులైన శ్రీ బొల్లాక్ వీరయ్యగారి పరిచయము మాత్రము ఇన్నాళ్ళ నుండిగాక। గత రెండు సంవత్సరముల లోపుననె కలిగినది।

గాన సంతోషము। అయితె వారు । శ్రీ శేషమాంబగారిచే రచియింపబడిన । బ్రహ్మైక్య బోధయను గ్రంథమును ముద్రితమొనరించిన బాగుండుననె । అందుకు తగిన ద్రవ్య సహాయమొనరించెదనను తన అభిప్రాయమును సంవత్సరక్రితమే తెలిపియుండెను । అయిన అట్టి సమయమునకు వేచి యుండగా ఇంతలో । శ్రీ మత్పరశురామ నరసింహ్మదాసు శ్రీ సీతారామ స్వాముల వారి అనుజుడు శ్రీ శేషమాంబగారి కనిష్టాగ్రజుండగు శ్రీ సూరయ్య (సూర్య నారాయణ) గారి సంతతికి చెందిన । పరశురామ శ్రీరాములుయను అయ్యవారు। సికింద్రాబాద్ మల్కాజిగిరిలో ప్రస్తుత నివాసులైన వారి పరిచయము కలిగినది। వారు తమ వంశోద్భవయగు శ్రీ శేషమాంబగారి జీవిత చరిత్రను వ్రాసుకొనిన ప్రతిని మరి వారి పితా పితామహుడగు సూరయ్య గారిచె రచియింపబడిన తాళపత్రముల మీది పద్యములను శేకరించి వ్రాసుకొనిన వాటిని చూపించిరి । శ్రీ శేషమాంబగారి జీవిత చరిత్రను । యీ మహా యోగిని యొక్క భ్రాంతి రహితాచల పరిపూర్ణ భావమున కనుగుణ్యముగా సరిపడునట్లు సంక్షిప్తముగా సవరించి । బ్రహ్మైక్య బోధయను గ్రంథ చతుర్థ ముద్రణయందు పొందుపరచిన బాగుండునను ఉద్దేశముతో యీ గ్రంథాదియందు ముద్రించనైనది। మరి సూరయ్య కవి గారిచె రచియింపబడిన । నాదాంతమై బ్రహ్మంబను నక్షత్రమాలా । శ్రీరామ షోడశ మహా పూజావిధాన పద్యములు। అచల సిద్ధాంతమును గురించి వ్రాయబడిన కొన్ని పద్యరత్నములను । యీ

బ్రహ్మైక్య బోధయను గ్రంథాంత్యమునందు చేర్పబడమైనది । గాన ఇదియొక గురుసేవగాభావించి। ఈ గ్రంథ చతుర్థ ముద్రణ యందు గావించిన మార్పు చేర్పులకు పాఠక మహాశయులు । సాంప్రదాయక గురుబంధు జనులు చదివి అలుక జెందక ఆనందించగలరని ఆశిస్తున్నాను ఈ చతుర్థ ముద్రితంబగు గ్రంథావతరణకు కారణము శ్రీ బాల్నాక్ వీరయ్య గౌలిగూడ చమన్ హైద్రాబాద్‌గారి ప్రోత్సాహమేగాక ధనసహాయముగూడ గావించినందులకు। వారికి వారి పుత్ర పౌత్రాదులందరికిట్టి ఉధారత్వము అందుకు తగిన ధనధాన్యాద్దైశ్వర్యములనిచ్చి బ్రాంతిరహితాచల పరిపూర్ణ గురుబోధస్థితిని ప్రసాదించగలందులకు సదా సద్గురు పరమాత్మను ప్రార్థించెదను.

ఇట్లు

బుధజన విధేయుడు

శ్రీ మంత పోయిదాసు

# కృతజ్ఞత

శ్రీ సద్గురు మాతామహి। పరమ పావని। పరమేష్ఠి గురు స్వరూపిణియగు శ్రీ శేషమాంబగారి విరచిత బ్రహ్మైక్య బోధయను గ్రంథము। యేతత్ గురుపీఠ పరంపరా చార్యుల ప్రోత్సాహమున ఇదివరకు మూడుసార్లు ముద్రితంబై। సాంప్రదాయక గురుబంధు జనులందరికి। పఠనీయ గ్రంథముగా విరాజిల్లినది। అయిన ప్రస్తుత మీ గ్రంథము పాఠకుల కందుబాటులో లేనందున। చతుర్థ ముద్రణ గావించిన బాగుండునను తలంపు కలిగినది। కాని మదీయ సంకల్ప సిద్ధికి। సమయానుకూలమున శ్రీ మంత సాయిదాసుగారి పరిచయము స్నేహసంబంధ మేర్పడి నందులకు చాలా సంతోషము। వారి మూల గ్రంథమున్నదున్న ట్లుంచుటయేగాక। అమ్మవారి జీవిత చరిత్రను శ్రీ మత్పరశు రాముని సూరయ్యగారి విరచితంబగు కొన్ని పద్యములను శేక రించి। ఈ గ్రంథ నాల్గవ ముద్రణయందు జేర్చుట ఇది యొక విశేషము। గాన వారికి నా యొక్క హృదయ పూర్వమైన కృత జ్ఞతలను తెలుపుకొను చున్నాను। ఇదిగాక సమయానికి శ్రీ శేష మాంబగారి జీవిత చరిత్రను। మరి సూరయ్యగారి పద్య రత్నా వళులను అందించిన। పరశురాముని శ్రీ రాములుయను అయ్య వారికి నా నమస్కృతులు। మరి యీ గ్రంథ చతుర్థ ముద్రణ యందు శ్రమయనక గృహ కృత్యంబుల లెక్కింపక। ఓర్పుతో

ప్రతిరోజు వచ్చి ముద్రణస్ఖాలిత్యాది దోషంబుల సరిచూచి సవరింపజేసిన శ్రీ కాడిగె నారాయణ హైద్రాబాద్ కార్వాన్ గారికి నా అభివందనములు। ఇంతకు మొదలు ఈ గ్రంథమును మూడు సార్లు ముద్రించిన ఖారంధరు మన వారలే గాన మనవారి అనుమతి మనకున్నట్లెయని భావించి యీ గ్రంథ చతుర్థ ముద్రణ గావించ బూనుకుంటిమి గాన మన వారందరు మన్నించగలరని మనవి। సకాలమునకు సర్వాంగ సుందరముగా గ్రంథ ముద్రణ గావించి ఇచ్చిన శ్రీ కిసాన్ ప్రెస్ వారికి నా యొక్క ధన్యవాదములు.

ఇట్లు

గ్రంథ ప్రోత్సాహకులు

ద్రవ్య సహాయకులు

బుధజన విధేయుడు

శ్రీ బాల్నాక్ వీరయ్యగారు

గొలిగూడ చమన్, హైద్రాబాద్.

# శ్రీ మదచలగురు పారంపర్యము

శ్రీ శ్రీధర స్వాములవారు

|

శ్రీ మదాత్రిమడుగు శివరామ దీక్షిత స్వాములవారు

|

శ్రీమత్ కంబాలూరు అప్పలబ్రహ్మంగారు

|

శ్రీమత్ పరశురామ సీతారామ స్వాములవారు

శ్రీమత్ భాగవతక్రిష్ణదేశికేంద్రులవారు
శ్రీమత్ పీఠాన లక్ష్మణ ప్రభువులు
శ్రీమత్ పీఠాన శంకర దేశికేంద్రుల వారు

శ్రీ శేషమాంబగారు
శ్రీమత్ గుముడెల్లి భారంగ ప్రభువుల వారు

శ్రీమత్ గుముడెల్లి సాంబయ్యగారు
శ్రీమత్ గుముడెల్లి శివ్వయ్యగారు
శ్రీ బాల్నాక్ వీరయ్యగారు

శ్రీ మోములక్రిష్ణమాచార్యులవారు
శ్రీ కస్వా సిద్ధాచల స్వాములవారు
శ్రీ మంతసాయిదాసు గారు

శ్రీమద్రామడుగు శ్రీ శివరామ దీక్షితావల
గురుపీఠ పరంపరాచార్యులు
శ్రీమత్ పరశురామ సీతారామస్వాములవారి
(సోదరి) ప్రియ శిష్యురాలు



## శ్రీ శేషమాంబగారు

గ్రంథకర్త

శ్లో॥ పరశురామాన్వయంబోధి । హిమాంశశ్చ మనోరమం
సీతారామస్య భక్తానాం । శేషాచల గురుంభజే॥

ఓం

## శ్రీ మధచలగురవేన్నమః

శ్రీ మధశరీర నిజగురు సాంప్రదాయక। పరిపూర్ణ బోధ సిద్ధాంత ప్రతిష్టాపనా చార్యులనగు శ్రీ శివరామ ధీక్షితాచల గురు పీఠాధిపతులు శ్రీమత్కాంభాలూరప్ప భర్తృహ్మము వారి ప్రియ శిష్యులు। శ్రీమత్పరశురాముని। శ్రీ శీతారామ స్వాముల వారి (సోదరి) ప్రియ శిష్యమణియగు

# శ్రీ మహాయోగిని శేషమాంభగారి సంక్షిప్త జీవన చరిత్ర

శ్లో॥ స్థాపకాయై చధర్మశ్య। సర్వ ధర్మ స్వరూపిణ్యై
అవతార వరిష్టాయై। శేషమాంభాయైతే నమః॥

వేద భూమియైన మన భారత దేశములో పురుషులతో పాటు స్త్రీలుగూడ అన్ని రంగాలలో। తమ తమ ప్రతిభావంతమును ప్రదర్శించి। వీర నారీమణులై విలసిల్లుటయే గాక వేదాంత రంగములో ముందడుగు వేసిన ముక్తిప్రదాయినులనబడు పరమ సాధ్వీమణులుగూడ యున్నారన వచ్చును అయినను జన్మతః యెవ్వరు గొప్పవారు కాలేరు కాని। కొందరిలో

పుట్టుకతోనె కొద్దిగ మహోత్తర శక్తులు, సుగుణ సంపత్తులు గోచరిస్తు యుంటావి. రాను రాను యవి జీవితములో కలుగు కష్ట నష్టములకోర్చి, ధైర్యముతోను, పట్టుదలతోను యెదుర్కొని నప్పుడె, యా మహోత్తర శక్తుల ప్రభావము ప్రకాశానికి వస్తుంటాయి. అట్టి కష్ట జీవితముతో ప్రభావితులైన వారియందు, శ్రీ శేషమాంబగారొకరు. జీవితములో ఆ మహాయోగిని పడిన కష్టాలు, వాటిని అధిగమించిన తీరును గురించి, ఆమె సంచరించిన ప్రదేశములకు వెళ్ళి, ఆయా ప్రదేశముల యందుగల, ఆమె యొక్క శిష్య పరంపరలను కలుసుకొని, పవిత్రమైన యా మహా యోగినీ చరిత్రను క్షుణ్ణముగా తెలుసుకొనుటయేగాక, యా మహా తల్లి రచించిన బ్రహ్మైక్య బోధ యను గ్రంథాధారమునుబట్టి, వినిన కనిన విశయములు వెలుగులోనికి తేవలయునను, కాంక్షతో యామె జీవిత చరిత్రను వ్రాయ దలంచితిని. ఇందులకు ఆమె యొక్క పవిత్రాంతరాత్మ ప్రేరణయే కారణమని భావించి, వ్రాయబడిన యీ ప్రతిని ప్రథమ పుష్పముగా యా మహా త్యాగమూర్తికె అంకిత మొనర్చుకొంటిని గాన ఇందలి తప్పొప్పులను మన్నించగలరని ప్రార్థనా॥

యేమహాయోగినియొక్క చరిత్రను తెలుపగోరితినో, యామహా పుణ్యవతియగు శ్రీ శేషమాంబగారిని గన్న తల్లిదండ్రులు, శ్రీ మత్పరశురాముని, కోటయ్య సుబ్బమాంబగారు, శ్రీకోటయ్యగారు (1760)లో తా॥ నర్సారావుపేట జిల్లా॥ గుంటూరుకు

చెందిన యేల్లూరు గ్రామములో నివసించుచుండెడివారు। కోటప్ప కొండవద్ద యజ్ఞయాగాదులు చేయుచుండుటచే వీరిని కోటయ్య సోమయాజులుయని పిలిచేవారట। వీరికి గుంటూరు జిల్లా కలెక్టర్ గారు రెండు సర్వేనంబర్లతో (80) యెకరముల శ్రోత్రియం భూమిని పట్టాచేయించి ఇచ్చినారు. వీరు వేదపండితులు। మంత్రశాస్త్రవేత్తలు సిద్ధాంతులు। వాక్శుద్ధి కలవారు। వీరికి నరసింహ్మదాసు। శ్రీ సీతారామయ్య, సూరయ్య లేదా (సూర్యనారాయణ) యను మువ్వురు పుత్రులుండిరి । తనకు కన్యాదానము చేయు భాగ్యము లేకపోయెనని ఆడపిల్ల ఇంటికి శోభయని లక్ష్మివంటిది యని సుబ్బమాంబగారు నాగుల చవితి రోజున ఉపవాసముండి నాగపూజాది వ్రతదీక్ష పరురాలయ్యి యుండుటచే కలిగిన ఇద్దరి కుమార్తెలకు। శేషమ్మయనియు నాగమ్మయనియు నామకరణము చేసియుండిరి.

ఇట్లు పుత్ర పుత్రికలైదుగురిలో। ప్రథమ పుత్రుడు నరసింహ్మదాసుగారు। వీరు సంస్కృతాంధ్ర పండితుడు గొప్ప కవీశ్వరుడు ఆయుర్వేద వైద్యులు గూడాను। వీరిచె రచియింపబడిన। భద్రాద్రి రామశతకము। పరశురామ సీతారామ శతకము యను యీ రెండు గ్రంథములే గాక। పరిపూర్ణ గురువేదాంత తత్వ కీర్తనలు గూడ తన గురుడైన అప్పబ్రహ్మముగారి పేర అంకితమిడి ప్రచురించినారు। ప్రస్తుత మవి ముద్రితములై ప్రచారములో యున్నవి। ఇవి గాక భద్రాద్రి రామాయణము

యక్షగానంబున రచియింపబడిన గ్రంథము। ఆముద్రితముగానె యుంది। హస్తాక్షరిలోనే యున్నది। వీరు ఒకరోజు భక్తులతో కూడి నడికుడియను గ్రామమునకువెళ్ళి। అక్కడ రామాలయము ముందు తన గుర్రమును కట్టివేసి। దేవాలయములోని కరిగి శ్రీరామా హరికథా గానము చేయుచుండగా నొక భక్తుడువచ్చి స్వామీ దాసుగారు మీ గుర్రము తప్పించుకుని పోయినదనిరి అయినను ఆయన చలించక దైవ ప్రార్థన గావించుచుండెనట.

## గేయము

రామా నీదాసుడనీ ప్రేమగోరి వచ్చినాను।
నేమమునను శేవజేసినీ। భజనమునను తరింపనా।
గుర్రము పారిపోయెనని ఇపుడే తెలిసింది।
యేగుట యెట్లితర గ్రామములకు నాలయంబులకు।
యేరీతిని నిన్ను నమ్మి యీకార్యము తీర్చగలను రామా॥

యని పాడుకొనుచుండగా। నంతలో నొక భక్తుడువచ్చి దాసుగారు మీ గుర్రమువచ్చి ముంగిట నిలుచున్నది యనెను అంత యా నరసింహ్మ దాసుగారు।

శార్దూ॥ రామా నీ మహిమా ప్రభావమెరుగన్ రాదెట్టి వారైన
కా। దామౌనుల్ చవిచూచినట్టి కరుణా। ధాముండవీ
వాదినే। మేమో బాధలు గల్గించితుదిన్ యెంతో మోద
మున్ గూర్తువీ। వీమాడ్కిన్ హయమబ్బ జెసితివి

విన్న నమ్మెదన్ భక్తితో। స్వామీ నే నరసింహ
దాసుడను। సంసారార్ణ వోత్తారకా॥ యని స్తుతిగావించి
నట్టి। వాక్పుద్ధి గలవారు

అయితే యీ నరసింహ దాసుకంటె। శ్రీ సీతారామయ్య గారె జ్యేష్ఠుడుయని। ప్రస్తుతమునంగల వారి గురు సాంప్రదాయకు లందరనుకొను చుండుటగలదు కాని। నరసింహ దాసుగారె జేష్ఠదని। నిరూపించుటకు గాను। ఆంధ్ర సాహిత్య సరస్వతి విద్యా భూషణ మల్లాది వేంకటనాగభూషణముగారు రచియించిన (తిరుమల దత్త శతకము) యను గ్రంథమందు ఆరవ పేజీ (55)వ పద్య మొకటి

తే।గీ॥ ధరణి భద్రాద్రి రామ శతకము వ్రాసి।
పేరు పొందెను నరసింహ విభుడు తాను।
అతని తమ్ముడు సీతారామాఖ్యుడలరు।
దాంత కంతేటి తిరుమల దత్త మూర్తి॥

యను యీ పద్యము వలన। నరసింహదాసుగారె పెద్దవాడని తెలియబడు చున్నది।

అయితె। కొన్ని పేజీలు లేక శిథిలమైయున్న (తిరుమల దత్త శతకంబను గ్రంథము మాకు లభించగా దాని యాధార మున నరసింహదాసుగారె పెద్దవారని తెలియ పరచినాము గాన యెవ్వరికైనను। యెక్కడనైనను సంపూర్ణ (తిరుమల దత్త

శతకంబను గ్రంథము లభించినచో మా కందియ్యగలరని మనవి చేసుకొను చున్నాము.

ఇక రెండవ వాడైన శ్రీ సీతారామ స్వాముల వారు। తపోనిష్టా గరిష్టులు శ్రీ మత్కంభాలూరప్ప బ్రహ్మము గారి శిష్యాగ్రగణ్యులు వేదాంత విశారదులు। స్త్రీలు పురుషులు యను భేద భావమెంచక। బాలులకు వృద్ధులకును। అచల పరిపూర్ణ భావంబు బోధించి అనేకులను పవిత్రము గావించిన మహోత్తములు। వీరు తమ సోదరియగు శ్రీ శేషమాంబగారి అంతరంగ మును శోధించి మెచ్చి। అచల పరిపూర్ణ బోధ ప్రచారమునకు అనుజ్ఞ యొసంగిరి తద్రీతిగానె। శ్రీమత్ భాగవత శ్రీ కృష్ణదేశి కేంద్రుల వారికిగూడ బోధాధికారం బొసగి (దిగువపాలెం)లో (1832)న బట్టబయలై యుండిన మహానుభావులు॥

ఇక మూడవ వాడైన సూరయ్య (సూర్యనారాయణ) యనువారు సంస్కృతాంధ్ర పండితులు కవీశ్వరులు వీరుగూడ శ్రీ అప్ప బ్రహ్మమువారికి శిష్యులై యుండిరి। వీరు నాదాంతమె బ్రహ్మ॥ శ్రీ రామశోడశోపచార మహాపూజా విధానము। అచల సిద్ధాంత నక్షత్ర మాలాయని। కంద గీత పద్యముల రచియించినారు అట్టి పద్యములు వ్రాత మూలకముగా। తాటియాకుల కమ్మలలోనున్నవి శేకరించి। ప్రస్తుతము నాల్గవ ముద్రణ గావించియున్న బ్రహ్మైక్య బోధయను గ్రంథములో ముద్రింప జేయబడినవి.

# శ్రీ శేషమాంబగారి వివాహ నిశ్చితార్థము

శ్రీ పరశురామ కోటయ్య సోమయాజులుగారు తన జ్యేష్ట కుమార్తెయగు శ్రీ శేషమాంబకు పదమూడవయేట చిన్నతనముననే। నర్సారావుపేట ఇలాఖాకు చెందిన నొక గ్రామమందుగల పిల్లవానికిచ్చి వివాహము చేయదలంచి। కన్యా నిశ్చితార్థమునకై। స్వగృహమునందు। శ్రీ శేషమాంబకు। కల్యాణం బొట్టుపెట్టి తాంబూలము ఇచ్చిపుచ్చుకొని। నెల రోజుల లోపల వివాహము జరుపుటకు ముహూర్థము నిశ్చయించి। బంధువులకు పెండ్లి పత్రికలు గూడ పంపియుండిరి కాని అంతలోనే కాబోవు వరుడు పొలమునకు పోయినచోట। పాము కాటునకు గురియై మరణించగా అమె వివాహము అంతటితో ఆగిపోయినది। అప్పటి కాలమునుబట్టి। యీలాంటి అశుభ సంఘటన జరిగినందువలన। మరియే పిల్లవాడు ఆమెను పరిణయమాడుటకు ముందునకు రాలేకపోయారు। ఇందు గురించి యాశేషమాంబగారు చిన్నతనము నుండియే। కన్నెబొమ్మగా యుండిపోయినది। అదిగని శ్రీ కోటయ్యగారు యీమెకు వేదాంతం అబ్బేయోగము యుందియని తెల్పిచెప్పారు।

తల్లియగు శ్రీ సుబ్బమాంబగారు। కన్న ప్రేమను పట్టజాలక నాగపూజాది వ్రతనోములచే బడసిన పుత్రికల యొక్క భవిషత్తు యేలాగున యున్నదోయని దుఃఖించుచుండెను। శ్రీ

కోటయ్యగారు దుఃఖితురాలైన తన భార్యను ఓదార్చుచు, మనము నిశ్చయించుకున్న పిల్లవాడు చనిపోయాడని బాధపడుచున్నాము కాని। యాపిల్లవానిని కనిన తల్లిదండ్రులెంత బాధపడుతున్నారోగద। దైవగతి నెరుగ నెవరితరము। అయినను। వివాహము కాక మొదలే। యీ సంఘటన జరగడము కొంత మేలేయైనది యని సుభ్బమాంబను గురించిపలుకుచుండగావిని త్యాగశీలినియగు శ్రీ శేషమాంబగారుతన తల్లితండ్రులనుగని। నాయనా। అమ్మా। నాదైతె ఏ వస్తువపోలేదు మీకుమాత్రము యేమినష్టమయ్యెనదని చింతిస్తున్నారు నేను మాత్రము ఆజన్మ బ్రహ్మచారిణినై। భాగవత భారత రామయణాది సద్గ్రంథ పఠనాదుల వలన, ముక్తిమార్గములో పయనించి ఆనందించెదను। వేరే మార్గములో పోనుయని ప్రమాణ పూర్వకముగా నుడివెదను మీరుమాత్రము నా విశయమై। యేమి చింతించనవసరము లేదనెను।

## చిన్న కూతురుయగు నాగమాంబగారి వివాహము

తరువాత కొన్నాళ్ళకు శ్రీ కోటయ్యగారు చిన్నకూతురు యగు నాగమాంబగారి వివాహము గురించి వినుకొండ తాలుక। గుండ్లకమ్మ నదియొడ్డున అయినవోలు గ్రామమునందు పం స్కృత పండితుడు వేదాధ్యయన పరుడు సకల సద్గుణ సంపన్నుడు రామ దేవాలయములో పూజారియగు శ్రీ రాఘవయ్య గారను పరునితో వివాహ సంబంధము కుదుర్చుకొని। యేల్లూ

మునకో తమ స్వంత గృహము అచ్చిరాదని, వరుని స్వగ్రామ మగు అయినవోలు శ్రీ రామ దేవాలయమునందె మహా వైభవముగా వివాహము గావించిరి లగ్న సంబరములో శ్రీ శేషమాంబగారు, తన చెల్లెలు భర్తయగు రాఘవయ్యతో, వరుసకు మరిదిగారు మా అమ్మ నాయనగారు ప్రేమచేత, నాకు శేష సర్పమని మీ శ్రీమతియగు నా చెల్లెలుకు, నాగ సర్పమని పేర్లు పెట్టినారు నీవు మాకు కావలసిన వస్తువులు తెచ్చి ఇవ్వ కుంటే జాగ్రత సుమాయని చలోక్తిగా యన్నాది, అందుకు రాఘవయ్య, వదినెగారు, మీ ఆడవారి బుద్ధులు అలాగేయుంటావి కాని ఇల్లంతా మీ వస్తువే కదా, మగవారమైన మేము సంపాదించి తెచ్చిపెట్టె ఇంటి నౌకర్లమే కదాయని । ఆయన గూడ చలోక్తినే విసిర్యాడు, ఈ రీతిగ అందరు ఆనందోత్సాహము లతో, కుంకుమ సౌభాగ్యవతురాలగు నాగమాంబను అయినవోలు గ్రామము అత్తవారి ఇంటిలోనే విడచి । అందరు యెల్లూరు గ్రామమునకు వెళ్ళిపోయిరి, నరసింహ్మదాసు శ్రీ శీతారామయ్య సూరయ్యగారల వివాహములు గూడ శ్రీ నాగమాంబ గారి వివాహము వరకె అందరి లగ్నములు గావింపబడి యుండెను,

## శ్రీ కోటయ్యగారికి గ్రామ కరణము గారికి మనస్పర్థ లేర్పడుట

శ్రీ కోటయ్యగారు సతిసుతాదులతో కూడి కాలక్షేపము

గావించుచుండగా । యేట్లూరు గ్రామ కరణము గారికి । తనకు యేదో వ్యవహార బేధముల వలన మనస్పర్థలు యేర్పడుట చేత శ్రీ కోటయ్యగారు యా గ్రామమందుండ నొల్లక సకుటుంబముతో బయలుదేరి । మార్కాపురము తాలూకకు చెందిన తోకపల్లె గ్రామమందుగల తిరుమల దేవాలయములో నివాసము గావించిరి । యాదేవాలయమునందు । రామ భజనలు । హరి కథలు పురాణములు రాగతాళ యుక్తముగ చెప్పుచుండెడివారు । అక్కడినుండి శ్రీ కోటయ్యగారు మరల యేట్లూరు గ్రామమునకు పోలేదు । కుమారులకు గూడపోవద్దని శాసించెను । పంట భూములను గూడ వదలుకొనెను । కొంత కాలమునకు శ్రీమతి సుబ్బమ్మగారు. అనంతరము కోటయ్యగారు పరమపదించిరి । తరువాత శ్రీ నరసింహ్మదాసుగారు శ్రీ శీతారామయ్య సూరయ్యగార్లు తమ చెల్లెలగు శ్రీ శేషమాంభతోసహా సకుటుంబ యుక్తముగ కాలక్షేపము చేయుచుండగా । యర్రగొండపాలెం దిగువపాలేం గ్రామాధికారుల ఆహ్వానముపైన అక్కడికి వెళ్ళి స్థిర నివాస మేర్పరుచుకొనిరి । అక్కడ శ్రీ శేషమాంభగారు। హరి కథలు పురాణములు వినుట। దేవాలయములకేగి భజనలు చేయుటయందెక్కువ మక్కువ గలిగియుండుట చూచి యామె వదినెగారలు। నీకు పెండ్లి పెటాకు లేమియు లేవు। చెక్క బొమ్మగా యున్నావు. ఆడదానికి వంట వార్పులు నేర్చుకొని ఇంటి పనులు జాగ్రత్తగా చేసుకుంటె ముక్తియనునది తనకు తానే వస్తుందియని యనెవారట।

తనను ఈ తీరుగా వదినె గారలు ఈర్ష్యా సూయలతో కనుఁకొనుటంతయు గ్రహించి భరించలేక। శ్రీ శేషమాంబ గారు అక్కడి నుండి। అయిన వోలు గ్రామమునకు వెళ్ళి అక్కడ తన చెల్లెలు భర్తయగు శ్రీ రాఘవయ్యగారి దగ్గర। ఉపనిషత్తులు కావ్యాది గ్రంథములు। భారత భాగవత రామాయణములను చదువుచు వినుచు। కవిత్వ లక్షణములను నేర్చుకొనుచు। దైవపూజ భజనలయందే కాలయాపన గావించుచుండెనట। అప్పుడప్పుడు యర్రగొండ పాలెమందుగల తన అన్నగారి దగ్గరకు వచ్చుచుండెడిది। శ్రీ శీతారామయ్యగారు ఈమె యొక్క మేధాశక్తిని పాండిత్యమును తత్వజ్ఞాన చింతనను గమనించి। వేదాంత సారమును భ్రాంతి రహితాచల పరిపూర్ణ భావమును బోధించి। యీ తత్వజ్ఞానము వృధాజేయక ప్రజలకు బోధించి। వారిని దైవచింతన మార్గములో యుండునట్లు చేయుమని అనుజ్ఞ యొసంగి ఆశీర్వదించిరి.

## శ్రీ శేషమాంబగారు మునిదేవుని పల్లె చేరుట

కొన్నాళ్ళ తర్వాత శ్రీ శేషమాంబగారు। అన్నగారుండిన యర్రగొండపాలెమునందుండ నొల్లక । మరి చెల్లెలు నాగమాంబ రాఘవయ్యగారి అయిన వోలు గ్రామముననుండ ఇష్టము లేక । తన గురువైన అన్న శ్రీ శీతారామబ్రహ్మముగారి ఆజ్ఞాప్రకారము । "చాలునె సంసారసాగరము। మానవస మంచి మార్గ

మున్నది మరియు గోప్యము" యనియనుచు తత్వబోధ ప్రచారము గావించుతు। భక్తుల కోరికలపై నందికోట్కూరు గ్రామమునకువచ్చి అక్కడ కొన్నాళ్ళుండి। కర్నూలు మహబూబు నగరు హైదాద్రాబాదు శంకర్‌పల్లి మీదుగా మునిదేవునిపల్లె సమీపమున కొండదేవుని గుడియను శివాలయమును చేరుకొనెను। అచ్చటి గ్రామస్థులు యీమెకు సుస్వాగతము పలుకుచు యామె పరిచయముగోరి వూరుపేరు వగైరా అడిగిరి। అందుకు శ్రీ శేషమాంబగారు। తానురచియించిన బ్రహ్మైక్య బోధయను గ్రంథమున తన జన్మవృత్తాంతమును గురించి చెప్పుకొన్న రీతిగా వారికి వివరించి చెప్పెను। ఇల్లును గ్రామమును బంధువుల నందరిని విడచి। గురువును గురువాక్యమును నమ్ముకొని అన్నిటికి శేషించి యున్నది గాన। శేషమాంబయను నామము యీమె యెడల సార్థకమై యున్నదని కీర్తించుచు। ఆమెయెడల భక్తి ప్రపత్తులుగలిగి వినయ విధేయతతో మెలగుచుండిరి.

## నైజాం సైన్యము వారినుండి తప్పించుకొనుట

కొన్నాళ్ళ తరువాత వకనాడు నైజాం సైన్యము హైదరాబాదు నుండి బీదరుకు పోవలయునని ఉత్తర్వుకాగా। యామార్గమున। మునిదేవుని పల్లెమీదుగా యున్నందున। ఇక్కడ ఒక బ్రాహ్మణస్త్రీ। బ్రహ్మచారిణియై। కాషాయ వస్త్రములు ధరించి। వేదాంత ప్రచారము చేయుచున్నదని। కొండ దేవుని

శివాలయములో యుంటుందను సంగతి గూఢాచారులవలన। యాసైన్యాధికారియగు కెప్టన్‌కు తెలిసి। ముందునకు పోవలసిన ప్రయాణమును అంతకె నిలుపుదల గావించి। యాబ్రాహ్మణస్త్రీని యీరాత్రి తానుభస చేసిన విధారమునకు తోలుకరావలయునని తన సైనికులలో కొందరి కాజ్ఞా ఇచ్చినట్లు శ్రీ శేషమాంబగారి భక్తులలో కొందరికి తెలియగా నంతలో వారువచ్చి యామెకీ సంగతంతయు తెలుపగా। కొండమీది గుడిలో మనము భజనలు చేయుచుండినవిని। యాసిపాయిలు కొండమీదికి వచ్చిన ప్రమాద మగునుగాన। కొండ క్రింద మురాదల్లి చేనులో సాయంత్రము భజనలు చేయుదమని భక్తులతో అక్కడ భజనలు చేయుచుండగా। అక్కడికి కొంత దూరాన। గుర్రపు సకిలింపులు కాలి నడక శబ్దములు వినరాగా। చేయుచున్న భజనలు చాలించి। శ్రీ శేషమాంబగారు భక్తులతో ఇటులన్నాది.

కం॥ మానంబేతోడపుసతులకు। మానమే ప్రాణా
ధికంబు మానమఖిలస। న్మానములకు మూలం
బగు। మానరహితమైన బ్రతుకు మానినికేలా॥

యని। అలనాడు సీతమ్మను చెరబట్టి రావాణాసూరుడు। ద్రౌపదిని మోహించి కీచకుడు। యామెను అవమానించిన దుర్యోధన దుశ్శాసను లాదిగాగల వారందరు తగుచాస్తి బొందినట్లు। తద్విధముగ నన్ను చెరబట్టదలంచిన యీకెప్టన్ కుగూడ తగుశిక్ష తప్పక కలుగుతుంది ఇది సత్యము। ఆచార్యానుగ్రహము.

అయినను । జన్మించిన మనకు మరణము తప్పదు । యీనాడు సైనికులచేత చిక్కకుండ యేవిషజంతువు చేతనైన మరణించినను మంచిదే గాన. నేను యీరోజు నాగురువుగారి ఆత్మలో చేరవలసి యున్నదేమో। యీ కొండ ప్రక్కనగల వాగు బొరియలో తలదాచు కొనుటకు వెళ్ళుచున్నాను। మీరందరు మీ త్రోవనపోండి। బ్రతికియుండిన మరల కలుసుకుందామయని శ్రీ శేషమాంబగారు నాగజెముడు పిచ్చితుమ్మచెట్లగుండా అనప అలసంద తీగెలలో దూరుకొనుచుపోయి యాకొండ నంటియున్న। మునిపల్లెవాగు బొరియలో చేరుకొని। ద్వారమునకు కొంత రాళ్ళుమట్టిని అడ్డముగా పెట్టుకొని। శితాఫలము ఆకుకొమ్మలను పరచుకొని మరికొన్ని కొమ్మలను పైన కప్పుకొని పరుండినది కాని నిద్రపట్టలేదు। అనేక విధములైన ఆలోచనలతో పట్టుచీరలుకొని। నగలుపెట్టుకొని। కొప్పువేసుకొని పూవులు ముడుచుకొని। నుదుట బొట్టు కన్నుల కాటుక ధరించి। నలుగురిలో విలాసముగ నుండవలసిన దానను। యీనాడిట్టి అవస్థలో నుండవలసెగదా। ఆహా విధివిలాసమెంత బలీయమైనదని। తనలో తాననుకొనుచు దైవచింతన చేయుచు తుదకు వేదాంతార్థము స్ఫురణకు తెచ్చుకొని। జరుగనున్నదేమో జరుగుగాకయని యారాత్రింతయు కాలము గడుపుచుండెను.

కెప్టన్ ఆర్డర్ ప్రకారము సైనికులు శ్రీ శేషమాంబ కొరకు కొండపైన క్రింద దేవాలయములో గుడిసెలలోయెక్కడ

సైన దాగియున్నదేమోనని వెదకి వెదకివేసారిరి। కనపడిన వారినందరిని అడిగిరి హింసించిరి కొన్ని దుష్ట ప్రవర్తనలను గూడ సలిపినారట కాని శేషమాంబగారి జాడ పొడలేమియు దొరకనందున। యాసైనికులుపోయి కెప్టన్‌నుకు తాము గావించిన ప్రయత్నమంతయు విఫలత్వమేనని విన్నవించగా యాతడు మండిపడి। తుమ్‌సబ్ బేవఖూఫ్‌హై। యేక్ బొమ్మన్ లడ్కీకో నహీపకడ్‌సకె। ఛలో అభీ బీదర్ ఆధారాస్తాహై। జరూరు జానాహై। యని కోపోద్ధితుడై సెలవీయగా। అక్కడి నుండి సైన్యమంతయు తరలి దారిలో కొండలు అడవులు వర్షము గాలిధూళి గాఢాంధఃకారము ఇత్యాదులవలన ప్రయాణమున కంతరాయమేర్పడి। గుర్రములు నడవలేక మందు గుండులు తినుభండారములు। దుస్తులన్నియు తడిసి కష్టముతో మరునాడు సాయంత్రము వరకు సైన్యము బీదరుకు చేరుకొనగా। అలక్ష్యమైనందున సైన్యముయొక్క వ్యవస్థంతయు విఫలమాయిననని। బీదరులోని పెద్ద పెద్ద జమీందారులూ కెప్టన్‌ను పదవీచ్యుతునిగా చేసినారని తరువాత మునిదేవునిపల్లె గ్రామస్థులకు తెలిసి మగువ కంటినీరు మంటలు రేగించు। యనియు। చేపకురా చెడెదవు యను సామెతలు సత్యమేనని యనుకొన్నారు.

## తెల్లవారి శ్రీ శేషమాంబ భక్తులను కలుసుకొనుట

తెల్లవారిన తరువాత శ్రీ శేషమాంబగారి భక్తులకు। సైనికులంతా వెళ్ళిపోయారని తెలిసినంతనే యామునిపల్లెవాగు

వొద్దువకువెళ్ళి ఆమెజాడకై వెదకుచు.

తెల్లవారెను మోహతిమిరంబెల్ల బాయెను।
జ్ఞాన ఉదయంబెల్ల ప్రబలంబాయె తన
మనసెల్ల స్థిరమాయెన్‌। ఆత్మ మేలుకొనవే॥

యని ఆమె రచియించిన సుప్రభాతంబను పాటను పాడుకొను చుండగా। యాపాట శబ్దమునువిని। తన భక్తులు గానముచేయు చున్నారని తనకొరకై వెదకుచున్నారని। సైన్యమంతయు వెళ్ళి పోయి యుండవచ్చునని గ్రహించి శ్రీ శేషమాంబగారు। తాను తలదాచుకొనిన బొరియలో నుండి బయటకురాగానే। భక్తులం దరు యామెను కలుసుకొని। గండము తప్పిపోయిందని సంతో షించిరి.

## శ్రీ శేషమాంబగారు యెనికెపల్లి గ్రామమునకు వెళ్ళుట

శ్రీ శేషమాంబగారు। అక్కడయున్న భక్తులతో కూడు కొని భజనలు చేయుచు। చేయించుచు భగవద్భక్తిని గురించి। వేదాంత తత్వ సారమును గురించి ప్రజలకు తెలుపుచు। పరి పూర్ణ గురుబోధ ప్రచారము గావించుచు। సదాశివపేటకు రెండు కిలో మీటర్ల దూరముననున్న యెనికెపల్లి గ్రామము చేరుకొ నెను। అక్కడ ఆమెయున్న కొద్ది రోజులలో శంకరాచారి పీఠ స్థుడయగు స్వాములవారు వచ్చియుండిరి। వారిని దర్శించుటకు

శ్రీ శేషమాంబగారు వెళ్ళి తలముండనముతో కాషాయ వస్త్రములు ధరించిన యాస్వామినిగని హరిగురు శ్రీ శీతారామాయ నమః। యని అభివాదము తెలిపెను । ఆస్వాములవారు ఆమెతో కుశల ప్రశ్నలు గావించెను। తరువాత శ్రీ స్వాములవారు శ్రీ శేషమాంబగారిని గురించి అమ్మా నీవు యీకాషాయ వస్త్రములు ధరించియున్నావు। మరి వేదాంత ప్రచారముకూడ చేయుచున్నావని విన్నాను। అయితే అలంకార సంబంధంబైన యీ కేశసంపద నీకింకయెందులకుయని ప్రశ్నించాడు। అందులకు అమ్మవారు। స్వామి పరమాత్మ సృష్టిలో చర్మముగల ప్రతి జంతువునకు। కేశము లుండుట సహజ ధర్మమైయున్నది। అయిన నాకి అలంకారముతో అవసరములేదు। ఇప్పుడే మీ సన్నిధియందు పెరికివేసెదను కాని। ఇకముందవి పెరుగకుండునట్లు చేసెదననీ । మీరభయం బిచ్చితిరేని ఇప్పుడే తీసివేసెదనని యనగా స్వామి వారందులకు మారుపలుకక। మౌనముగా యుండుటనుచూచి అమ్మవారట నుండిలేచి తన నివాసస్థానమునకు వెళ్ళిపోయెను। ఆపైన ఆస్వామివారు తనలో తాను పక ఆడకూతురును। అవమానించితిని గదాయని అనుకొనెను। ఆరాత్రి ఆయనకు కడుపులో శూలనొప్పి యేర్పడెను। తనకు తెలిసిన చిట్కా వైద్యముతో యీబాధ తగ్గలేదు। స్వామి పడుచున్న బాధనుచూచి అక్కడున్న భక్తులు శ్రీ శేషమాంబగారి జీవిత విశేషమును। గురువాక్య వేదాంత విచారణాది నిష్టాగరిష్టతను।

నిగ్రహానుగ్రహాది శక్తిని గురించి వివరించి చెప్పగా। ఆమెను పిలిపించిరి।

శ్రీ శేషమాంబగారు। స్వామివారు పడుచున్న బాధను చూచి। అయ్యాలారా। యేబాధలెరుగని। యేబాధలు కలిగించని బోధస్వరూపుడైన మద్గురు దేవునివలన గాని తద్బోధ పరులైన వారివలనగాని। యెవ్వరికిన్ని యేలాంటి బాధలు కలుగనేరవు। అయినను। యేబోధ శిష్యులకుగల యాబాధలదీర్చ వేసునదె సద్బోధా। యనున్యాయమున అట్టి సద్బోధను ప్రసాదించిన నాగురుదేవుని కృపవలన। ప్రస్తుతము యీ స్వాముల వారికి కలిగినబాధ సమసిపోవుగాకయని స్మరించెదనని పకతులసి దళమును నీటిలోవేసి। గురుదేవుని తలంచుకొని।

శ్లో॥ అకాల మృత్యు హరణం సర్వ వ్యాధి నివారణం।
సమస్త పాపక్షయకరం శ్రీ గురు పాదోదకం పావనం శుభం॥

యని ఉచ్చరించుచు। ఉద్ధరిణితో మూడుసార్లు యీ స్వామి వారి నోటిలో వేసెను। కొంత సేపటికి యీ స్వాములవారు నెమ్మదిగా లేచి। శ్రీ శేషమాంబగారికి ధన్యవాదములు పలుకుచు। అమ్మా నీ యునికి యేలాంటిదోయని పరీక్షించుటకై। నీకు యీ క్లేశ సంపద యెందులకని యంటిని అయిన నీ యొక్క అహం రహితాచల పరిపూర్ణ బోధస్థితి అర్థమైనది। వేదాంత ప్రచా

రమునకు తగిన సమర్థురాలవు। నీ కేమిటను యెవ్వరితోను అడ్డుదగులజోదని ఆశీర్వదించెను అంతటితో శ్రీ శేషమాంబ గారు యీ స్వాముల వారి ప్రశంశానీయమైన పలుకులకు మదిలో పొంగక । క్రుంగక । ధన్యవాదములు తెలుపుచు అట నుండి భక్తులతో వెళ్ళి। నాటినుండి తలకేశములను ముడివేయక విరియబోసుకునె యుండెను।

ఇట్లు శ్రీ శేషమాంబగారు। తన గురు కృపాలబ్ద జ్ఞానము చేత। వేద వేదాంత సిద్ధాంతములను। ఉపనిషదార్థములను పరిశోధించినదై । ద్విపద రూపమున బ్రహ్మైక్యబోధయను గ్రంథమును। తత్వ కీర్తనములను ఆంధ్రమున సులభముగా తెలియునటుల రచియించిరి। అక్కడక్కడ భక్తుల కోరికలపై సంచరించుచు బ్రహ్మ విద్యను ప్రచారము గావించుచుండెను। ముఖ్యమైన భక్తుల అంతరంగమును శోదించి భ్రాంతి రహితాచల పరిపూర్ణ బోధను జేయుచు ముక్తి ప్రదాయిని యని కీర్తిగాంచెను। ఇంతియే గాక తన భక్తులలో । చిన్న మంగళారము యను గ్రామమునగల శ్రీమత్ గుమ్మెళ్ల ఘారపెంగ పృభువుల వారికి। మధునూరు శ్రీ గోపాలాచార్యుల వారికి।మునిదేవుని పల్లెయందు శ్రీ చంద్రమాంబగారికిన్ని సర్వ ధర్మ మర్మంబుల చెప్పి । బోధాధికారం బొసంగి। యేమిట మీకు భయంబులేదని అభయం బిడిన అచల గురు స్వరూపిణియగు। అమ్మవారు తుదకు సదా శివపేటకు సమీపమందున్న । యెనికెపల్లె గ్రామమునె చేరు

కొనెను। అక్కడయున్న శంకర మఠములో పడమర దిశయం దున్న శివాలయము కెదురుగ తూర్పునగల మండపమునందు। భక్త మండలితో గూడుకొని భజనలు చేయుచు। గురుధ్యాన నిమగ్నమై। సహజా మనస్క పట్టాభిషిక్తురాలై। యా మండపమునందె ప్రాలి। 1888లో పరమపద మొందెను.

భక్తులందరు శ్రీ శంకరమఠముయొక్క దక్షిణ ప్రాకారమునకు రెండడుగుల దూరమున యామహాయోగిని యొక్క సమాధిని స్థాపించిరి। ఇప్పటికీ యామె సమాధి స్థానమందే కాక। సాంప్రదాయక గురుభక్త జనులందరు। ఆమె ఛాయాపటముల నుంచుకొని ఆరాధించుకొనుచున్నారు। అట్టి కారణ జన్మురాలైన సద్గురు మాతా శ్రీ శేషమాంభగారి పాదపద్మములకు వందనములొనర్చి యామహాతల్లి యొక్క దివ్యాను గ్రహము రాగోరుచు యామె జీవిత చరిత్రను ఇంతటితో విరమింతును।

## గద్య

శ్రీ మత్పరశురామ వంశాబ్ధి చంద్రిండనబరగు శ్రీ కోటేశ్వర సుబ్బమాంభగర్భ జనితులగు। శ్రీ నరసింహ్మదాసు। శ్రీ శీతారామస్వామి। శ్రీ సూరయ్య శేషమాంభ శ్రీ నాగమాంభ గారిలో। శ్రీ సూరయ్యగారి సంతతికి చెందిన వాడనగు నేను। మావంశోద్భవయగు శ్రీ శేషమాంభగారి జీవిత చరిత్రను ఆమె రచియించిన బ్రహ్మైక్య బోధయను గ్రంథాధారమునబట్టి। మరి

యామె నివశించిన గ్రామంబులకు వెళ్ళి అక్కడ శిష్య ప్రశిష్యాది సాంప్రదాయక గురుబంధు జనులను కలుసుకొని వారికి తెలిసి నంతమట్టుకు సంగ్రహించి వ్రాయబడిన యీ వ్యాస ప్రతిని। ఆమహాయోగినిగారి దివ్య శ్రీ చరణారవిందములకె ప్రథమ పుష్పముగా సమర్పించుకొందును.

ఇట్లు

**పరశురాముని శ్రీరాములు**

మల్కాజిగిరి, సికింద్రాబాదు

ఓం

శ్రీ సద్గురుభ్యోనమః

# బ్రహ్మైక్యబోధ

## పూర్వ భాగము

## ప్రథమోధ్యాయము - సభా విజ్ఞాపనము

(ద్విపద వాక్యాలు)

### ౧ గురు ధ్యానము

శ్రీగురు పాదములే । చిత్తంబులోన
బాగుగా దలచియు । ప్రస్తుతించెదను
పరమగురువుల నెపుడు । ప్రార్థనజేసి
అసదుమీరగ పరం । పరగురువులవేడి॥

### ౨ సకల దేవతా ప్రార్థనము

కార్యసిద్ధికినై । గణనాథుదలచి
అద్యుల స్తుతియించి । అల సరస్వతిని
కొనియాడివ్యాసుల । కూర్మినుతియించి
అనువొంద వాల్మికి । నతిభక్తివేడి

శ్రీరామచంద్రుల । చిత్తమందునిచి
ఆరూఢికవులకు । అతిభక్తి మ్రొక్కి
సాధుజనములకెల్ల । సాష్టాంగమిడియు
వేదాంతజనముల । వినుతి సేయుచును

## 3 కథా ప్రారంభము

సకల వేదాంతార్థ । సారమంతయును
అకలంక బ్రహ్మైక్య । మనుభవబోధ
ఒప్పయినద్వైపదగా । వర్ణింతునిపుడు

## 4 ఆచార్యానుగ్రహము

తప్పునేనెరుగను । తాత్పర్యమెరుగ
పరమదయాళుండు । భక్తవత్సలుడు
పరశురామాన్వయ । పాదోధిసోము
డైన శీతారాము । లాప్తముగనన్ను
కనుగొని పిలిచియు । కరుణతోడుతను
పరమ రహస్యమౌ । భావమంతయును
అరుదు మీరగనాకు । అంతయుజెప్పి
పరిపూర్ణమైతాను । బయలులోగలిసె

## 5 అచల పరిపూర్ణస్థితి

ఎరుక మరుపులులేక । యేకస్వభావు
డై యుండునంతలో । అతిమోదముననుం
పాయక యాభావ । పద్ధతిదెలిసి

## ౬ గురువాజ్ఞ

తెనుగుగానందరికి । తెలియునట్లుగను
వినిపించబూనితి । విశదంబుగాను
శ్రీగురువాజ్ఞనే । శిరసావహించి
బాగుమీర వ్రిపంచ । పద్ధతెల్లనిన
విదితంబుగామీకు । వివరింతునిపుడు

## గద్య

శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్యబోధ
ద్విపదవాక్యము పూర్వభాగ
ప్రథమోధ్యాయము
సభావిజ్ఞాపనము
సమాప్తము.

# ద్వితీయోధ్యాయము

# గురుశిష్య అన్యోన్యదర్శనము

## ౧ ప్రపంచోత్పత్తి లక్షణము

(పరిపూర్ణ భావము)

ఆదికాలమునందు । అదియేమిలేక
అంతటనిండియు । అమలమైయుండి

(ఎరుక భావము)

యంతట తనకుదా । ఆత్మయుబుట్టె
ఆయాత్మవల్లను । ఆకాశమపుడు
పాయక జనియించి । ప్రఖ్యాతిగాను
ఆకాశమునబుట్టె । అప్పుడు వాయు
వాయువందుననగ్ని । వరుసనుదయించె
ఆయగ్ని వల్లను । అప్పుజనియించె
నాయప్పువల్లను । నవనిజన్మించె
నవనియందునధాన్య । మప్పుడుద్భవించె
యవరసాన్నములయ్యె । నారసంబునను
దేహంబులై బుట్టె । తేజంబుగాను
మోహంబు కామంబు । ముదముతోగలిగె

## ౨ జన్మహేతు లక్షణం

ఇదిగాక జన్మమున । కింకొకవిధము
సదమలవేదాంత । శాస్త్రములయందు
ఆయాత్మయందున । అప్పుడుమాయ
మాయ యందజ్ఞాన । మపుడుద్భవించె
ఘనముగా నజ్ఞాన । మున దోచెనపుడు
వినయంబుగా నవి । వేకంబునందు
అభిమానమునదోచె । నందునరాగ
మభినుతించ జనించె । నంతమీదటను
రాగమువలన క । ర్మలుజనియించె
బాగుగ కర్మల । బరగె దేహములు
ఈ విధంబునబుట్టె । నీ ప్రపంచంబు

## ౬ జీవధారము

అమలమై జనముల । కాధారమగుచు
అన్నమే కానిమరి । అందేమిలేదు
అన్నరసముచేత । అఖిల మానవులు
పుట్టుచు గిట్టుచు । పెరుగుచుండుదురు
ఇట్టిది మాయయన । నెర్వరుపలేక
“అన్నాద్భూతాని । సమరజాయంతే
అన్నేన జీవంతి” । యనిశ్రుతిబలుక

అన్నముగలిగిన । నదిదృఢంబగును
అన్నములేకున్న । నదిసన్నమగును
అన్నముగావలె । అంత్యముదాక
ఎన్ని విధములనయిన ఏర్పరుచుకొనుచు
పన్నుగాగురుజేరె పద్ధతెరుగకను

## ౪ అష్టపాశములు

కన్న తల్లియు తండ్రి కడు భార్యయనుచు
తన సహోదరులంచు తన పుత్రులనుచు
తన గృహంబనుచును తన ధనంబనుచు
తగిలి మమతచేత తన్నుకాడుచును
మిగుల వగలనుజెంది । మిడుకుచుండుదురు

## ౫ పామరత్వము

తన్నుదా తెలియక । తనగర్వమునను
కన్నరాళ్ళకు మ్రొక్కి । కడగానలేక
తల్లెవరో తండ్రెవరో । తనపుత్రులెవరో
వెళ్ళిపోయెడువేళ । వెంటనురారు

## ౬ కర్మానుభవము

తనపూర్వకర్మంబు । తాననుభవించ
కనుదప్పిపోదురా । కడకేగుదనుక

## ౭ నిత్యానిత్యవేకము

అనిచాలనూహించి । ఆత్మలోపలను
తనువనిత్యంబని । తాత్పర్యమెరిగి

## ౮ గురుని ఆశ్రయించడము

పరిపూర్ణగురుజేరె । పద్ధతెట్లనిన
గురిగాను జెప్పెద । కూర్చుండివినుము
తనగృహంబగ్నిచే । దగ్ధంబుగాగ
తనువు తప్పించుక । తాపరుగెత్తు
విధమునగురుజేరి । విశదంబుగాను

## ౯ శరణాగతి

సాధన లేకుండ । బోధింపుమనుచు
ద్వాదశసాష్టాంగ । దండముల్ జేసి
వివిధ శుశ్రూషలు । వేర్వేరవాటి
విధమెట్టిదనీననే విన్నవించెదను

## ౧౦ చతుర్విధ శుశ్రూషలు

(ఆత్మ శుశ్రూష)

గురువుకోరిన కోర్కె । కొనసాగగాను
అరుదుమీరగ సేయు । బదియాత్మసేవ

(అంగ శుశ్రూష)

పాదాది మస్తక । పర్యంతమునను
మోదముగ అభ్యంజ । నాదికృత్యముల
అన్నిటి సేయుట । యదియంగ సేవ

(స్థాన శుశ్రూష)

అన్న పానాది గృ । హాదులయందు
సమ్మతిగ మనసుంచి । సరిగచేయుటయు
నియమమ్ముగా జరుపు । టయస్థాన సేవ

(భావ శుశ్రూష)

తన తల్లిదండ్రులు । తన సతి సుతులు
ధనము మనంబును । తన శరీరమును
మనసుతో గూడియు । మరి గురుని సొమ్ము
అని తెలిసి యుండుటే । నది భావసేవ
ఈ విధంబున సేవ । చెలమి సేయుచును
భావజ్ఞుడగు గురు పాదములకొరిగి
పదిరెండు మారుల పడుచు లేచుచును
పదిలముగ చేతులు । పట్టుకనిలచి

౨౧ శిష్య విజ్ఞాపనము

మొరబెట్టుకోవలె । మోహంబు విడచి
సరగున గురుపాద । సన్నిధియందు

సదమల వేదాంత । సార అతీత
సాధు హృదయ నిలయ । సత్య స్వరూప
హే సద్గురు ప్రభు । హే పరమ పురుష
వాసనా త్రయముల । వడిబడి దిరిగి
తాపత్ర యాగ్నిచే । దరిగానలేక
పాప పుణ్యంబులు । పరగ నేయుచును
కర్మ త్రయంబుల । కడతేరలేక
దుర్మతినై మది । తోచగారాని
మలములు మూటిలో । మమతచే మునిగి
కులగోత్ర సూత్రముల । కూడి చరించి
ఈ షణత్రియముల కెదురొడ్డలేక
అష్ట షడూర్ముల । ననుభవించుచును
అష్టపాశములను । అరికట్లుదగిలి
దుష్టులతోగూడి । త్రోవ తెలియకను
ఇచ్చట పొడగంటి । ఈ వరకు మిమ్ము
మత్సర ముంచక । మర్మంబు దెలిపి
నన్ను రక్షించవే । నా తండ్రియనిన

## —: త్రివిధ దీక్షలు :—

వన్నుగా గురుమూర్తి । భక్తునియందు
సదయుడై శిష్యుని । సద్భక్తి మెచ్చి

అదరకుమని చెప్పి । అతిథి రమ్మనుచు
స్వస్తికారోహణ । స్పర్శ దీక్షత్రయం
స్వస్తముగ గావించి । సరగునకృపచే

౧౩ హస్తమస్తక సంయోగము

తనహస్త మతనిమ । స్తకమునబెట్టి
అనుమాన ముడుగుమని । అప్పుడిట్లనియె

౧౪

కారణదేహాచి । త్కళలెల్లనీకు
ఓరిశిల్లగజేతు । ఒక్కపెట్టనుచు
మనసుకుదురగజేసి । మాయనుబాపి
మునుసాంఖ్య, తారక, । ముల, యమనస్క
మనెడుమూడు విధముల । మార్గముల్ గలవు
సాధనపత్వారి । సంప్రాప్తిముందు
బోధజేసెడినపుడు । పొందుగావినుము

౧౫

శ్రీమత్పరశురామ శ్రీనరసింహదాసుగారి సోదరియగు శ్రీశేష మాంబ విరచిత బ్రహ్మైక్యబోధ ద్విపదవాక్య పూర్వభాగ ద్వితీయోధ్యాయము గురుశిష్య అన్యోన్యదర్శనము సమాప్తము.

# తృతీయోధ్యాయము-ఉపదేశ క్రమము

## ౧ సాధన చతుష్టయము

(నిత్యానిత్యవస్తు వివేకము)

సత్యంబు బ్రహ్మం । బసత్యంబుజగము
నిత్యమ్ము తెలియుట । నిదియునునొకటి

(ఇహాముత్రార్థ ఫలభోగవిరాగము)

ఇహమందు ననుభ । వించెడి భోగములును
బహువిధంబగు స్వర్గ । పదభోగములును
త్యాగము జేయుట । బాగుగాఫలవి
రాగమునౌనిది । రమ్యముగనొకటి

(శమాది షట్కసంపత్తి)

శమదమంబులు శాంతి । శ్రద్ధోపరతులు
సమతతోగలుగుట । సరగుననొకటి

(ముముక్షత్వము)

మోక్షంబుమీద । నాపేక్షకానితరా
పేక్షయులేదను । ప్రియముననొకటి
యివినాల్గు సాధనము । లింపుగా దెలసి

## ౨ తత్త్వవిచార సాంఖ్యభావము

అవిరళంబగుసాంఖ్య । మదియెట్టిదనిన
పంచవింశతితత్త్వ । పద్ధతితెలియ
కొంకకజెప్పెద । కొమరొప్పవినుము

(జ్ఞానేంద్రియ కర్మేంద్రియములు)

కన్నులు చెవులును । ఘ్రాణంబుచర్మ
మెన్నగా జిహ్వయు । నివియుజ్ఞానేంద్రి
యంబులు వాక్కులు । ఏర్పడియున్న
పదములు పాణులు । బరగ గుదగుహ్య
ములును కర్మేంద్రియ । ములని చెప్పనగు

(తన్మాత్రలు)

సలలిత శబ్దంబు । స్పర్శ రూపంబు
అంచితమౌ రస । మమర గంధంబు
పంచతన్మాత్రలని । యెంచగాబడును

(ప్రాణాదులు)

ప్రాణమపానంబు । పరగవ్యానంబు
నాణెమౌదానంబు । నమరిసమాన
మనుమిశ్రమౌ ప్రాణ । ములని చెప్పుదురు

(అంతః కరణములు)

మనసును బుద్ధియు । మరిహంకృతియును
చిత్తంబు జ్ఞానంబు । స్థిరముతోడుతను
మొత్తమై యివితత్వ । మూలంబులయ్యె
ఇవిపంచ వింశతి । నిన్నిటినెరుగు
ప్రవిమల ఎరుకయే । పరమాత్ముడనియు
యీవిధమున తెలియ । నిదియె సాంఖ్యంబు

## ౭ ధ్యానముద్ర - మంత్రియోగము

(తారక భావము)

కేవలతారక । భావంబువినుము
స్నాన సంధ్యాద్యను । ష్టానవిధులెల్ల
మౌనముతోజేసి । మరియొక్క స్థలము
జేరియు నరులెవరు । జేరరాకుండ
ఆరూఢియైన । సిద్ధాసనంబునను
కూర్చుండి మంత్రంబు । కూర్మిజపించి
పేర్చిన భక్తితో । ప్రియముగానపుడు
కన్నులుమూసియు । కడువెన్నునిక్క
పన్నుగా వాయువుల్ । పదియొకటిజేసి
తిన్నగనాసాగ్ర । దృష్టిలోపలను
నున్న హంసనుగని । యోర్పుతోడుతను

## ౪ రాధాయంత్ర ముద్ర లయయోగము

(షట్చక్రములు)

ఆధారచక్రము । నందుననిలచి
స్వాధిష్టమునకు । సరగుననేగి
ఘనమణిపూరక । కమలముజేరి
అనువుగా నాహత । మచటవిశుద్ధ
చక్రమునకుబోయి । సరగునవాని
అక్రమించుకయున్న । ఆజ్ఞేయమునకు
జేరిభ్రూమధ్యంబు । జెందియున్న
సారమౌ సహస్రార । సరసిజమందు
నుండు రాజద్వార । మొగి అందులోన

(దశవిధ నాదములు)

మెండుగా మ్రోగేటి । మేఘనాదంబు
చిణిచిణీనాదంబు । చిణియనిపలుక
వేణునాదముమరి । వీణెనాదంబు
భేరి శంఖ మృదంగ । భీమనాదములు
ఈరీతి వినుచును । ఇందుపైనున్న
నాదమౌ ఓంకార । నాదంబునందు
పాదుగాయున్నట్టి । బ్రహ్మనుగనిన
నదియె తారకమని । యందురుబుధులు

## ౨౭ షణ్ముఖీముద్ర హఠయోగము

ఇదిగాకయున్నది । ఇంకొకవిధము
తనమనసు భ్రూమధ్య । స్థానమందునిచి
అనువైన అంగుష్ట । మున చెవులుమూసి
మధ్యతర్జనులచే । మరికనులమూసి
తథ్యమౌనాశికా । స్థలములనామి
కమున మూసికనిష్ట । కమునవక్త్రంబు
నమరంగ మూసియు । నటపాదములను
గుదగుహ్యములమూసి । గురుపైనజేర్చి
ముదముతోచూడవి । విధచోద్యములను
సూర్యచంద్రులవలె । చుక్కలవలెను
కార్యమౌ మోహంబు । కరిణినిగనుచు
యెండమావులవలె । యలమెరుపువలెను
నిండు చీకటివలె । నిబిడమైయుండు
మినమినమెరసెటి । మిణుగురులవలెను
కనబడియణగుచు । గ్రక్కున నంత
వందువెన్నెలబట్ట । బయలునునప్పుడు
మెండుగాకనులతు । మిరుమిట్లుగొలుపు
అవినేనుగానని । యన్నిటినెరుగు
పరివిమల చైతన్య । భావంబుదెలియ
నదియె తారకయోగ । మనిజెప్పబడును

## ౭. శాంభవీముద్ర-రాజయోగము

### (అమనస్క భావము)

పదపడి కారణ । భావంబు వినుము
అంగంబునందు । ప్రత్యంగంబులోన
సంగతమైయుండు । స్థానంబునందు
సోమ మండలమును । సూర్య మండలము
ఆ మీద నుండును అగ్ని మండలము
పాదుకొని యా మీద బహు ప్రకాశముగ
అది సూక్ష్మరూపమై । ఆడుచునుండు
నదియనివారశూ । కాగ్రంబటంచు
పదపడి శ్రుతులను । పలుకుచునుండు
నదియె విద్యుల్లేఖ । యను నక్షరంబు
నదియె ఆపోజ్యోతి । నదియె ప్రణవంబు
నదెబ్రహ్మమదెవిష్ణు । వదె సాంబశివుడు
అదె జగత్కారణ । మదె సకల జనులు
అదియె ఆత్మామతవ । మది అమనస్క
మది దెలియలేకను । అఖిల మానవులు
చెడిపోవుచుందురు । చేపెరుంగకను

# గద్య

శ్రీమత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్వి పదవాక్య పూర్వభాగ
తృతీయో ధ్యాయము
ఉపదేశ క్రమము
సమాప్తము

# చతుర్థోధ్యాయము-మతాల లక్షణం

## ౧ యోగులు

పుడమిలో కొందరు । భూతియుబూసి
పన్నుగా జడలును । బాగుగాజుట్టి
తన్నుతా దెలియక । తనవారి విడిచి
ఉండనిల్లునులేక । ఉపవాసములను
పండ మంచములేక । పంచలబండి
పర్వతంబులు గుహలు । బహు వనంబులును
వేర్వేర దిరుగుచు । వేసట బడుచు
ఆకులు అలముల । ఆకలిదీర్చ
కాకులై దిరుగుచు । కడు అవస్థలను
బడిపొరలు చేకాని । పరమందలేరు

## ౨ జ్ఞానులు

విడిబడి కొందరు । పేత్తల మనుచు
కుండగోలయుబట్టి । నిండవిభూతి
మెండుగాబూసియు । మెడను రుద్రాక్ష
మాలికల్ ధరియించి । మార్గముబట్టి
పోలులు దిరుగను । పోదురుగాని
బ్రహ్మమందాత్మైక్య । భావమెరుగకను

## ౬ సన్యాసులు

జిహ్వకు రుచిగ । భోంచేసెటి కొరకు
జుట్టు జంధ్యముదీసి । చోద్యమౌ కావి
బట్టలు జుట్టుక । చుట్టాలబాపి
జపమాల ధరియించి । జలజాక్షుస్మరణ
నెపముగా ద్రిప్పుచు । నేత్రముల్ మూసి
నారాయణాయనుచు । నరులు జూడగను
ఊరూరనొకనాడు । ఉచితముగనుండి
భక్ష్యభోజ్యంబులు । పక్వాన్నములను
భిక్షసేయుచు తాము భక్షించుకొనుచు
నుండుటయేకాని । యుచితమైనట్టి
ఘనమైన భావంబు । కానకవారు
ముక్తి జెందెదమనుచు । మురయుచుండుదురు

## ౭ తీర్థయాత్రలు

కొందరు యాత్రల । కరిగి మోక్షంబు
అందుకోవలెనని । ఆశజనించి
మందినిగూర్చుక । మార్గముబట్టి
కాశిరామేశ్వర । గయ ప్రయాగములు
ఈశుని సేవించి । ఇలమీదగలుగు
గంగ కావేరియు । గౌతమీకృష్ణ

తుంగభద్రయు యమున । తోయంబులందు
మునుగుటయేకాని । ముక్తి మార్గంబు
గణనసేయరుకంట్ల । కావరమునను
అక్కడక్కడ తిరిగి । అలతురుగాని
చక్కని మార్గంబు । సాధించలేరు

## ౨ యజ్ఞములు

అజ్ఞానమున కొంత । యజ్ఞములజేసి
ప్రజ్ఞలు బలుకుచు । బహు డాంబికమున
కుండలంబులు చెవుల గునిసియాడంగ
తిండికి లేకను । తిరిగి యూరూర
మెండైన యాగముల్ । మేము జేసెదము
దండిగా ధనములు । తమకు ఇమ్మనుచు
చిక్కు మతములజేసి । చికాకుపరచి
కుటిల వృత్తులచేత । కూర్చిన ధనము
మటు మాయముగదాచి । మరి స్వల్ప వ్యయము
గావించి మరిమరి । గ్రామ గ్రామముల
తీవరంబుగనేగి । తెరువు లోపలను
యెవ్వరైనను ధన । మెక్కువగలుగు
నవ్వ దాన్యునిగని । యచ్చోట ప్రీతి
ఆసన కుద్దిగా । నందుగూర్చుండి

వేసరికయులేక । వేవురతోను
తా నేయు యజ్ఞంబు । తనయన్నదాన
మూసించు వారల । కర్థిదానిచ్చు
దక్షిణలనుపెద్ద । దడవాత్మమతిని
దక్షుడై మాటికి । తల త్రిప్పి త్రిప్పి
చెప్పుచు యిల్లెల్ల । చేయింపుడనుచు
ఎప్పుడు జనులను । ఎలమి యాచించి
ఇహపర సౌఖ్యంబు । లిచ్చుయించుచును
గహనంబులోబడి । తానరు ముక్తి

## ౬ జంగాలు

చంకను జోలెయు । చక్కగా దొడిగి
వంకర శంఖంబు । నొకచేతబట్టి
పూరింపు కొనుచును । బూడిదెబూసి
పారము దెలియక । బ్రహ్మానుభవము
గోరనేరక తమకు । గురు లింగమనుచు
హరహరా యనుచును । అయ్యలమనుచు
తిరుగుచుందురు గాని । దేహంబు మీరి
హరుడున్న కైలాస । మందుకోలేరు

## ౭ వైష్ణవులు

బుట్టి ప్రసాదంబు । తట్టెడు దినియు
పట్టె వర్ధనములు । బాగుగా దీర్చి
కట్టిన వస్త్రముల్ । కడుతెల్లజేసి
ఇట్టట్టు దిరుగుచు । నెలమి(శ్రీ)విష్ణు
భక్తుల మనుచును । పరమపదమయిన
ముక్తియు గానక । మురియుచుండుదురు

## ౮ మధ్వలు

మరియును కొందరు । మధ్వల మనుచును
సరగున ముద్రలు । కరమునబూని
అమరంగ గాల్చిన । యంతనే మోక్ష
దముగల్గునని భ్రాంతి । దగులుచేకాని

## గద్య

శ్రీమత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్వి పదవాక్య పూర్వభాగము
చతుర్థోధ్యాయము
మతాల లక్షణము
సమాప్తము

శ్రీ సీతారామ పరబ్రహ్మణేనమః

# బ్రహ్మైక్య బోధ

## ఉత్తర భాగము

### (ద్విపద వాక్యము)

## పంచమోధ్యాయము-మహావాక్యములు

వినుము శాస్త్రజ్ఞాన । విధమున నీకు
ననువుగా జెప్పెద । నాల్గు వాక్యములు
పజ్ఞానమును బ్రహ్మ । బ్రహ్మాహ మస్మి
తజ్ఞులు బలుకుదురు । తత్వమసి యనుచు
ఆయమాత్మ బ్రహ్మంబు । యనుచు వేదములు

### ౧ పద త్రయములు

నయముగా బల్కెను । నందున మూడు
పదములు గల్గుత । త్పదముత్వం పదము
కదియును అసిపదము । కారణమయ్యె
తత్పద శబ్దమాం । తర్య మీశ్వరుడు
ఉత్పత్తి త్వంపద । మునను జీవుడు
అసిపద మీరెంటి । కైక్యంబు నగును

వేర్వేర చెప్పెద । వినుమీశ్వరునకు
సర్వజ్ఞ గుణములు । చాలగలిగుండు
మణుగుచు జీవుండు । మొనసి కించత్వ
గుణముల తోడుత । గూడిచరించు
కించజ్ఞ సర్వజ్ఞకే । క్రియనైక్య
మంచితంబుగగల్గ । దనినను వినుము
వాచ్యార్థమునుబల్క । పరుస విరోధ
మేచాయ గలిగిన । నెరిగిలక్ష్యార్థ
మంగీకరించుము । నది మనస్సునకు
తగగను లక్షణ । తత్వము వినుము

## ౨ వాచార్థము విడచిన లక్షణము

విడచిన లక్షణ । విధమెట్టదనిన
నడువడి చెప్పెద । నవనిలో భూమి
పుంగవు డొక్కడు । పుణ్యనదియైన
గంగకు జనుదెంచి । గ్రక్కునరాగ
కనియొక బ్రాహ్మణుడు । గంగయందేమి
కనుగొంటివి విశేష కథలని యడుగ
గంగయందునుపల్లె । గలదని చనియె
గంగా ప్రవాహంబు । గలదానియందు
పల్లెయుండుటయును । బహు విరోధంబు

వల్లెయనుచును మదిని । వాచ్యార్థ మొదలి
సంగతి లక్ష్యార్థ । సారముచేత
గంగను విడచియు । గట్టునపల్లె
యని తెలుసుకొనుట । జహల్లక్షణంబు
యని చెప్పుచుందురు । నటువలెత్వంప
దార్థ కూటస్థమై । తన్యముగూడ
వ్యర్థమని విడచిన । యలరి మోక్షస్వ
రూపుడు లేకను । రూఢితో జనుట
ఉపమచేత గ్రహించి । ఒనరగానున్న
మయమును మొదలుగా । మరియు విజ్ఞాన
మయములు జడభూత । మైనందు వలన
యవి ఆత్మగాదని । యన్నిటి విడచి
స్థావరంబుగనధి । ష్టానమైయున్నయది
యని తెలుసుకొనుటయు । నదియె లక్షణము

## 3 లక్ష్యార్థము విడువని లక్షణము

విడువని లక్షణ । వృత్తాంతమెల్ల
తరయక నికును । దగనెరిగింతు
మంచె కూతలబెట్టి । మాటలోయర్థ
మెంచగా మంచెపై । మెలగియుందున్న

నరుడు కూతలుబెట్టు । ననుచును దెలిసి
అలసత్యజ్ఞాన । మంతయు బ్రహ్మ
మును సచ్చిదానంద । మునుగలసినాటి
ననువుగా విడువక । యానందమయము
నందున ఆత్మయు । జెందియుండుటయు
పొందుగా నైక్యము । పొసగదుదీని

## ౪ విడచి విడువని లక్షణం

విడచియు విడువని । వెస లక్షణంబు
మదివెద నీకును । నొక దేవదత్తు
నైదేండ్ల వాసిని । నచ్చట గంగ
నదియందు కనుకొని । నంతట కొన్ని
దినముల కావేరి । తీరమునందు
గనుగొన మనమున । గలగె సందేహ
మాతడె ఈతడని । యారసిచూడ
మాతతమాకాల । మదిఇదిగాదు
దేశముగాదు । ఈ తీరముగాదు
వాసిగా ఇప్పుడీ యీ । వయసునుగాదు
దేశ కాలమురీతి । దేరిన నవల
లేశమైనను సంధి । నెనగకయుండు

గనుక వాడు వయస్సు । కాలముతీర
మనువుగా విడిచియు । మరియు లక్ష్యార్థ
భావము చేతను । పరగ గ్రహించి
దేవదత్తుడేయని । తెలసి వాచ్యార్థ
మాయా ప్రతిఫలిత । మైన ఈశ్వరుడు
అయుతన సర్వజ్ఞ । త్వాదిగుణములును
అట్టి అవిద్యయం । దమరి ప్రతిఫలిత
మైన జీవునకు । యమరిన కించిత్వ
గుణములు గల్గును । కూర్మితోవాటి
గణనము జేసిన । గలుగ దైక్యతయు
ఇచట ఈశ్వరు మహా । నియ్య గుణములును
విడచిన సాక్షియై । వెలుగుచునుండు
తడయక లక్ష్యంబై । తన్యంబు దెలియు
జీవు డీశ్వరునితో । స్థిరముగా గలియు
భావింప నంతయు । బ్రహ్మమైయుండు
సత్వరంబుగను ఈ తత్వంబునంత
చెత్వారి వాక్యముల్ । చెప్పుచునుండు

## ౨ ప్రజ్ఞానం బ్రహ్మయనుశృతి

ప్రజ్ఞానమున బ్రహ్మ । పద్ధతి వినుము
ఏ జ్ఞానమునను । నేత్రేంద్రియ ద్వార

బహిర్గతమయి స్వరూ । పంబున నెరుగు
సహనము శీతోష్ణ । స్పర్శ చర్మంబు
ఏ జ్ఞానమునను దా । నెరుగుచునుండు
ఏ జ్ఞానమున ఘ్రాణ మెరుగు గంధంబు
ఏ జ్ఞానమున జిహ్వ । యెరుగు షడ్రుచులు
ఏ జ్ఞానమునను స । ర్వేంద్రియంబులను
సకల విషయంబులు । సలుపుచునుండు
అకలంక మగుప్రజ్ఞ । మదియేది యనిన
బ్రహ్మంబు యనుచును । బలుకుచునుండు
బ్రహ్మ దేవేంద్రాది । ప్రభృతి దేవాళ్ళ
మానుషాళ్ళగవాది । మరి పిపీలికము
అనిస్యూత చైతన్య । మనగను గలదు
"తచ్చైతన్యతా । త్సర్వమే బ్రహ్మ"
సచ్చిదానందమై । సమముగానుండు

## ౭ అహంబ్రహ్మాస్మి యనుశ్రుతి

అహంబ్రహ్మ పదమున । కర్థ మేమనిన
అహంకారమునులేక । నదియును వినుడి
పరిపూర్ణమైయున్న । పరమాత్మ బ్రహ్మ
రూప నామంబులు । రూఢిగాలేక

బుద్ధికి సాక్షియై । పూర్ణమై యున్న
యదె నహం బ్రహ్మంబు । యనుచు జెప్పెదరు
ప్రతిలేని దైన్వతః । పరిపూర్ణమగుచు
అతిశయ బ్రహ్మ । శబ్దంబననొప్పు
"అహమేవ బ్రహ్మ । బ్రహ్మైవాహ" మన్న
అహమస్మి యనెడి । పదార్థంబుమూరు
వాచ్యార్థమనివాటి । వదలి యజ్ఞాని
వాచ్యార్థ లక్ష్యార్థ । వరస నొక్కటిగ
లక్షణంబు గనుసు । లక్ష్యార్థ మెరిగి
ఆక్షణంబుననె బ్ర । హ్మైక్యంబునొందు

## ౭ తత్త్వమసి యనుశ్రుతి

తత్వమసి యనుశ్రుతికి । తాత్పర్య మనిన
తత్పద, త్వంపద । తగ, నసిపదము
ఏకంబు జేసిన । నెలమి పరిపూర్ణ
మకలంక పరిపూర్ణ । మని చెప్పబడును
తన వివేకంబున । తను చతుష్టయము
గనుగొన్న పూర్ణాధి । కారియైయుండు
ధీమనంబులకును । దేహేంద్రియముల
కమలమ్మె సాక్షియై । యమరి వెల్గునది

అదియె త్వంపదమన । నదియె లక్ష్యార్థ
మదియును దెలయుట । యసిపదమండ్రు

లా అయమాత్మ బ్రహ్మమను శృతి

అయమాత్మ బ్రహ్మంబు । యనుపల్కు శృతికి
నయముగా తాత్పర్య । నియతి జెప్పెదను
స్వచ్ఛమై సత్యమై । స్వ ప్రకాశమున
యపరోక్షమై నిత్యమై । యమల మగును
నాద్యంత రహితమై । యచలమైయెప్పు
డాద్యమౌనదె అయ । మాత్మ బ్రహ్మంబు

## గద్య

శ్రీమత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్వి పదవాక్య ఉత్తర భాగము
పంచమోధ్యాయము
మహా వాక్యములు
సమాప్తము

# షష్ఠమోధ్యాయము-పరిపూర్ణ బోధ

## ౧ ద్వాదశి, షోడశి భావము

అహం బ్రహ్మమనకను । అవల యేమనిన
అహం బ్రహ్మ కావల । అతి రహస్యంబు
పరమ రహస్య మం । దరి కెరుకలేదు
ఏ పగిదనవచ్చు । ఇల వెర్రులకును
సాధుల కెల్లను । సంపూర్ణమగుచు
వేదాంత జనులకు । వెలితి లేకుండు
బ్రహ్మ కల్పనగాదు । ప్రతి యుగముగాదు
నిర్మలంబై నట్టి । నిర్గుణ మగును
ఆకాశమును గాదు । అలవాయు గాదు
ప్రాకటంబగు నగ్ని భయమును గాదు
ఉదకములును గాదు । ఉర్వియును గాదు
సదమల వేదాంత । సారమైయుండు
పగలు రాత్రులు గాదు । పర్వముల్ గాదు
అగుపడుటయు గాదు । అందేమి లేదు
పెరుగుట । విరుగుట । పెంపుట గాదు
సరళపొట్టియుగాదు సన్నమునుగాదు
శ్వేతవర్ణము గాదు । సేవింపరాదు

పీతవర్ణము గాదు । ప్రియమందిచూడ
అతిశయ రక్త । వర్ణంబులు గాదు
మఱి నీలవర్ణమే । మనలేదు తలప
పుట్టుట లేనిది । గిట్టుట లేదు
ఇట్టిదియని మది । నెంచగరాదు
అదియును బ్రహ్మాండ । మంత వ్యాపించి
అదియు పరిపూర్ణమై । అంతట నిండి

## ౨ సూచన

ఉన్నది పరిపూర్ణ । ముపముచే దెలిసి
ఉన్నది ఉన్నది । ఒక్కటి యగుచు
కన్నది విన్నది । కాదని తెలిసి
ఉన్నదే ఉన్నది । యన్న దృఢ మతిని

## ౩ కారణము

సకల దేశములందు । సకల కాలముల
సకల వస్తువులందు । చలనములేక
ఏకముగ యుండును । ఏమనరాక
ప్రాగ్ దక్షిణంబుల । పశ్చిమోత్తరము
నాల్గు మూలలమీద । నడుమను క్రింద
కాల త్రయంబుల । కదలక నిండి

సచరా చరంబుల । జాడ నెరుగకను
అచలమై సత్యమై । అమలమై యున్న
ఈ వృత్తి బైలత । ప్పేమి లేదనుచు
భావింప వలయును । భ్రాంతియు లేక
ఇది ద్వాదశాక్షరి । ఇంకొకటి వినుము
విదితముగ షోడశీ । వివరింతు నిపుడు
కలగన్న గజము । మేల్కాంచిన లేదు
కళికి కర్పూరము । కలసినయట్లు
క్రమముగా శోధించ । భ్రమ యుక్తమైన
ఈ మూలంలేని । గుర్తెరిగే శరీర
మిదియేమి లేదని । ఈలాగుతన్ను
మదిలోన భావించ । మాయతా తొలగు
భావజ్ఞుడై గురు । పదములు నమ్మి
కేవలంబుగ నిదుర । చావొచ్చు దనుక
వరులెవ్వరైనను । నాల్గు జాతులలో
పరిపూర్ణ భావంబు । బాయక యుంటె
జనన మరణ భ్రాంతి । జెందరు వారు

## ౪ ఆశీర్వచనము

మనసున సంతోష । మందుదు రెపుడు
సతిసుతుల్ హితబంధు । సంఘంబుతోను

అతులి తైశ్వర్యంబు । లనుభ వించెదరు
మతి మంతులగుచును । మన్నన గలిగి
నీతియు దప్పక । నిర్మలు లగుచు
అండ పిండాండ బ్రి । హ్మాండ బాండముల
నిండి యుండినబైట । నెలమి యుండెదరు

## గద్య

శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రిహ్మైక్య బోధ
ద్విపదవాక్య ఉత్తర భాగము
షష్టయోధ్యాయము
పరిపూర్ణ బోధ
సమాప్తం.

# సప్తమోధ్యాయము

## గ్రంథకర్త వృత్తాంతము

### ౧ తల్లిదండ్రులు

వినరయ్య నా జన్మ । వృత్తాంత మంత
అనువుగా జెప్పెద । నమరగ మీకు
పరశు రామాన్వయ । పాదోధి చంద్ర
సురుచియౌ కోటయ్య । సుబ్బమాంబకును
జనన మైతిని నేను । జగము లోపలను
ఘనమయిన కష్ట సు । ఖములను భవించి
చాలు చాలిక నాకు । సంసార మమత
మేలులే దిందులో । మేల్ గనుట యనుచు

### ౨ గురు దేవతలు

పరశు రామాన్వయ । పతి సీతరామ
గురునకు శుశ్రూష । కోరి కావించి
వారి బోధయువిని । వసుమతిలోన
వారి సత్కృపగాని । వాసి కెక్కితిని

### ౩ అంకితము

ఊరేమి పేరేమి । ఉండుచే దనిన

ఊప పేరునులేదు । ఉనికెందులేదు
లేక యుండిన లోకు । లెల్ల నన్నెపుడు
శేషమ్మ యనుచును । చెలగి పేర్పెట్టి
అనిశంబునను బిల్తు । రందరు గూడి
మునిదేవ పల్లెలో । ముదముతో నుండి
చెప్పితి గ్రంథంబు । చెవులార వినుడి

## గద్య

శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్విపద వాక్య ఉత్తర భాగము
సప్తమోధ్యాయము
గ్రంథకర్త వృత్తాంతము
సమాప్తం.

# అష్టమోధ్యాయము-గ్రంధ ఫలము

## ౧ ఆత్మానుభవము

ఎప్పుడు ఈ గ్రంధ । మెవరు వ్రాసినను
ఎవ్వరు చదివిన । యెవ్వరు వినిన
ఇవ్వసు మతినిదా । మెంత కాలంబు
ఓపికతో ధ్యాన । మొనరించి రేని
ఆ పరమాత్మలో । నైక్య మయ్యెదరు

## ౨ సత్కవి స్తోత్రము

యతులు గణంబులు । ఎఱుగను నేను
అతిశయ ప్రాసమి । శ్రమముల నెరుగ
ఎప్పుడు గురుసేవయే । ఎతి గణము
ఎప్పుడు గురుభజ । నే ప్రాసములును
తప్పులున్నను కవుల్ । తాల్మితో దిద్ది
మెప్పించి ఈ బోధ । మేలుగనరయ్య

## ౩ సంపూర్ణ కటాక్షము

ఆకాశ మెందాక । అబ్ధు లెందాక
ప్రాకటంబుగ చంద్ర । భాను లెందాక

అందాక ఈ బోధ । ఆనందముగను
సందేహము లేక । చాల వర్ధిల్లు

## గద్య

శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్విపద వాక్య ఉత్తర భాగము
షష్టమోధ్యాయము
సమాప్తం.

శ్రీ సద్గురు పరశురామ సీతారామ చరణార వింధార్పణం
సంపూర్ణం

ఓం

శ్రీశివరామ దీక్షిత అచల గురువేనమః

శ్రీమదప్ప బ్రిహ్మ గురువేనమః

శ్రీ పరశురామ సీతారామ గురువేనమః

# శ్రీ శేషమాంబగారి విరచిత

## పరమతత్వములు

### ౧ కీర్తన

శరణుజేశెదాను గురురాయా। నన్ను చేపట్టుకరుణా విధేయా ॥ప॥ నేరాము లెంచాకుస్వామీ। నిన్ను నెరనమ్మి యున్నానదేమి। నేను నీదానానుసుమ్మి। నీపాదా పద్మము లెనమ్మి ॥౧॥ పరులాబారికినన్ను ద్రోయాకు। నాపాపపుణ్యము లాను ఎంచాకు। పదరానిబాధల బెట్టాకు। యిది పాతాకు రాలానియెన్నాకు॥ శర ౨॥ దండిదాతవానివింటినీ। నీకన్నాదైవములేదంటినీ। నీదాపునే జేరుకుంటినీ। నీవె దయవుంచుమని వేడుకుంటినీ ॥౩॥ క్షుత్పిపాసల కోర్వ్యజాల। నన్ను కష్టపెట్టుట నీకుమేలా। నాభాగ్యమునిన్ననేలా। భక్తమానాసహృదయాబ్జాలోలా ॥శర॥ ॥౪॥ చుట్టాపక్కములా నేబాసితి। నా చుట్టున్నా వారివిడనాడితీ। నీవెనాచుట్టామువాని మదినుంచితి

నిన్నెంతోనమ్మితి ॥శ॥ ॥౫॥ నరులాను నమ్మలేదయ్యా। నిన్నె
నమ్మితి నాకితరాసామ్మేలనయ్యా । నన్నుపోషించ నీవెనయ్యా।
నేనెన్నెన్నొవిధములా నమ్మితినయ్యా॥ శ॥౬॥ నన్నూరక్షించా
కయున్నా । నాతిప్పలుకల్గు అన్యన్నా । పరులు ఈమాటాలు
విన్నా । వారుపకపకనవ్వరోయన్నా॥ శ॥ ౭॥ దేహదారుఢ్యాము
బోదా । నేలేవాలెకున్నానువాదా । నన్ను యిహమందువుంచి
తేమేధా । నీవు ఇదుగొ రమ్మనిపిల్వరాదా॥ శ॥ ౮॥ నేవాకు
రాలానుసుమ్మీ । శేషమ్మజేసిన మనవి చెవునుంచుకొమ్మీ ।
శాశ్వతపదవినాకిమ్మీ । యీశరీరమె నీదాయసుమ్మీ॥శ॥ ౯॥
పగలు రాత్రిలు నిన్నెమారాను । నీవెపరిపూర్ణ రూపామనియే
దాను । పాతాకహరుడావని విన్నాను । సీతరాములె గురుడాను
కున్నాను॥ శర॥ ౧౦॥

## ౨ కీర్తన

సద్గూరురాయుని రమ్మానే । చానానా మనవిగైకొ
మ్మానే ॥ప॥ త్రివిధావిధదీక్షలొసర్చెనే। నాశిరమూపై హస్తాము
జేర్చెనే ॥౧॥ నాసటాభాశిత రేఖాదిర్చెనే। నీనోముఫలమె మంచి
దానెనే॥ స॥ ౨॥ మూడుమండలమూలు జూపెనే । నద్మము క్తి
కాంతతొ పొందుగల్పెనే ॥ ౩॥ చిన్నానాటినుంచి వున్నానే ।
నేచింతజేయక నేనుండానె॥ ౪ ॥ వాదాభేదము వదిలించేనే ।
ప్రణవానాదము చవినినాటించెనే ॥ ౫॥ పతితాపావన బిరుదు
వున్నాదే । భక్తపరిపాలన నేయరమ్మానె ॥౬॥ యేడుమేడల

నేక్కించేనే । రొండుకోడెపాముల నాడించేనే ॥౭॥ భ్రూమధ్య మున చూపునిల్పేనే । మంచిపున్నామ వెన్నెలలోనుంచేనే ॥౮॥ పాతాకముల పారాదోరేనే । బట్టాబయలూలో నామనసు గల్పేనే ॥౯॥ శేషమ్మొ మొరవీనుమూనావే ।నీకు శేవాకురాలాని చెప్పావే ॥స ౧౦॥ పరుశురాముని సీతారామునీ। నన్ను పాలించినా గూరు దేవూని ॥౧౧॥

## ౩ కీర్తన

యెందుకూ ఈ దేహము। గురుమహిమదెలియనిదెందుకూ సందేహమూ । యెందుకూ యీ దేహమూ ఇక యెందుకూ యీ మోహమికను। సందుగొందుల నిండియుండిన సమరసైక్య ముజెంద కున్నది ॥యెం॥ ॥౧॥ కోటి జన్మములెత్తి। నరగర్భ మందు నవాటముగాబుట్టి । కాటుకాపక్షులరొంటిని మాటుబెట్టిచూ చి। త్రికూటమధ్యమునందు యుండిన సూటిదెలియానేరకున్నది—౨॥ వందనంబులుజేసీ । గురు పాదుకలు తన శిరమునందున మోశీ। నిందనిందలదగుల కనుమది సందియంబులుమాని బ్రహ్మ । మందుజేరియుండి పరమానందమందు జెందకుండిన ॥దె॥ యెన్ని జెప్పినగానీ। తనమతము విడువాకుండుటా అదిమేమీ। యెన్ని విధములనైన పంచా వన్నె చిల్కలుచూచిచూచి । కన్నులాయం దున్నకాంతిని కలసిమెలసివుండనేరని ॥४॥ మండలామధ్యాము నా। యుండీన యూకుండలీపైనున్న। ఎండమావుల తీగెమెరుపుల దండిగా గనుగొనుచు బహుగా ॥ నుండవని నీ మదికి దెలిసియు

పండువెన్నెల జూడకుండిన ॥౫॥ చెవినఇల్లాగట్టి। చెప్పెను శేష మ్మజెప్పిన మాటి । మాటికిమాటికి చూచి చుక్కలకోటి సూర్యా చంద్ర దన్నులు । గోటమీటుచు దాటిపొయ్యే బాటదెలియా నేర కున్నది ॥౬॥ పరశూరామునీ। పరమైన సీతారాములేగురుడానీ। పరమ హంసా రూపమయ్యీ బయలులో విహరించు చూమతి । పరవశంబై పరమపదమై పరముజెందానేరకున్నది ॥యెం॥ ౭॥

## ౪ కీర్తన

ఏమనందూ। సద్గురు మహిమా యెంతానికందూ । అంతా ఇంతయాని వివరింతామంటెనూ । మంతానమునసూ నా మనుసే మిలేదాయ ॥ప॥ యెన్నాగరాదు । వేడుకమీరి యున్నాదిగాదు । యెన్నెన్నో జన్మాము లెత్తాగగురుజేరి । పన్నుగనేటికి పరిశుద్ధా మైతీని ॥యె॥ ॥౧॥ చూడాగరాదు। చూపులోన రూపాములేదు । చూపురూపులేని సూత్రాముదెలసీతె । పాపామెలేదాయ పరమ పదంబాయె ॥౨॥ తత్పదముగాదూ । దానచె వాచాత్వంపద ములేదూ । అసిపాదమనియేటి ఐక్యా భావముగాదు । అన్ని దేశములందు ఆవారించిన మహిమ ॥౩॥ నెనేమి లేదు । నీ వనె మాట నిల్వగరాదు । నీవు నేనులేని నిజభావ మెరిగితె। నిర్వికల్ప మాయ నిగమాగోచరమాయ ॥౪॥ పలుకాగరాదూ । పరి పూర్ణమై బాధాయులేదు । పరశురాముల సీతారామూల రూపాము బయలందైక్యమాయె భావామూ భావమాయె ॥౫॥

## ౫ కీర్తన

నమః శివాయనవే దేహము నమ్మరాదుగదవే । బొమ్మలలోని యెమ్మెకజూచి॥ నమ్మికై నదిగదవే ॥ప॥ శివపంచాక్షరి మంత్రములోను శివుడున్నాడనవే । శివజీవైక్య సంధానముదెలిసితె। శివశివశివశివశివాశివాయని ॥ న ॥౧॥ నళినహిరణ్యా గర్భలోను హరుడున్నాడనవే । ఆదెసీవార శూకాగ్రంబనుచును । హరహరహరహరహరాహరాయని ॥౨॥ అంగములోపల లింగరూపమై పొంగుచు నున్నాడే । అంగ స్థానము జంగం బెరిగితె। లింగలింగ శివలింగాయని ॥౩॥ పంకజముఖిరో పరాత్పరుడుంచె శంకరుడున్నాడే । చక్కనిగుహలో సాక్షిరూపమై। దిక్కుదిక్కు నాల్దిక్కులజూచుచు ॥౪॥ మనసులలోనే మాయరూపమై మర్మము గలవాడే। మనునే ఆతడని మర్మము దెలిసితె। మహాదేవ మహాదేవ మహాదేవాయనీ ॥౫॥ కనుగొంటినని కన్నులయందున ఘనుడున్నాడనవే ।కనులజూచితె కీలకమంతయు। ఘంటానాదము గణగణ మోగ్రియగ ॥౬॥ శైవమతము ఈలాగుయనుచు శేషమ్మ జెప్పెగదవే । శరీరమందున్న శాణను దెలసితె శంభో శంభో శివశంభోయని ॥౭॥ పరశురామ సీతారాములు ఈ పద్ధతి తేల్చెగదే । బాగుగ వీటితొ పనియేమనచును బయలు లోన నిర్భయులు జూడుమనె॥ నమఃశివాయ ॥౮॥

## ౬ కీర్తన

తారకనామము దలచితె ముక్తి దగ్గరవున్నాదీ । తారక

నామము తలువని వారిని తరిమెనన్నాదీ ॥ప॥ మోక్షముకావలె నన్నవారికి మోక్షమిచ్చినదీ। కుక్షిలోపలా మర్మము దెలిసితె గూఢమైయున్నాదీ । అంతర్లక్ష్యము చూచిన వారికి రమ్యంబై నాదీ । నిక్షేపంబై నమ్మినవారికి రక్షకమైనాదీ ॥తా ॥౧॥ కామముకోరిన వారికినెల్లా కామములొసగినదీ । కామ క్రోధ గుణంబులు విడచితె కనుపడుచున్నాదీ । నేమకర్మములేక జగంబున నిండుకయున్నాదీ । నామరూపములేక చూచితే రమ్యంబై నాదీ ॥౨॥ అర్థముకావలెనన్న వారికి అర్థమిచ్చినదీ । మంత్రశుద్ధి కొరకు నై జపముజేసితె శుద్ధంబై నాదీ।చిన్ముద్రలుపట్టి చూచిన వారికి శుద్ధంబై నాదీ । బుద్ధిమంతులై కనుగొంటెను పరిపూర్ణంబై నాదీ ॥౩॥ పంచభూత ప్రపంచంబంతా పరువంబున్నాదీ। సంచిత కర్మము లన్నియుబట్టి దృంచివేసినాదీ । కొంచమనక గురు సూత్రముతోడుత గొప్పైయున్నాదీ । నియమించియు ధ్యాన్నించినవారికి నిర్మలమైనాదీ ॥౪॥ శరణనెవారిని కరుణించెదనని బిరుదువేసినాదీ । సేవజేశి గురుభజనజేసితే శ్రేష్ఠంబన్నాదీ । చెడిపోకను శ్రీరాముని దలచితే శాశ్వతమన్నాదీ । శేషమ్మ జెప్పినా వాక్యములన్ని చెవిజొచ్చుమన్నాదీ ॥౫॥ పరిపరి విధముల ప్రస్తుతిజేసితె పరమైయున్నాదీ । పరశురాములా వారి నోటను పలుకుచునున్నాదీ । సిరులు సంపదల నొసగెదననుచు సిద్ధంబై నాదీ । సీతారాములు నాకుజెప్పితె స్థిరమైయున్నాదీ ॥౬॥

## ౮ కీర్తన

సర్వసూన్యమె బ్రహ్మంబనుచూ చాటుచుండురోరీ । సర్వప్రపంచం మాయాయని దాని సంది దెలియరోరీ ॥౧॥ దశావతారాల నేటిమాటలు వృత్తవిగదరోరీ దనరమునుల ఋష్యాదులందరి జాడలేదురోరీ ॥౨॥ బ్రహ్మదిందాౖ ప్రభృతులు అంతా ప్రకృతి పురుషులోరీ । ప్రకృతికి పరమైయున్నది వస్తువు ప్రేమతోగనరోరీ ॥౩॥ ఎక్కడజూచిన పక్కబైయున్నది వేరులేదురోరీ వెలిలో లోపల వెలగుచున్నది వేరులేదురోరీ ॥౪॥ పలుకుల కందక భావమునంటక పరమున్నదిరోరీ । పరమానందము జెందియునీవును బయలుదెలియరోరీ ॥౫॥ పరశురామ సీతారాములు మనపాలిటగలదోరీ । బాగుగ శేషమ్మ జెప్పిన వినక పరముదొరుకదోరీ । సర్వసూ ॥౬॥

## ౯ కీర్తన

బ్రహ్మ మనరా భ్రాంతి విడరా । పరబ్రహ్మమనరా భ్రాంతి విడరా। అజ్ఞానమనెతిమిరా మంటాకుండియునీవు। ప్రజ్ఞానం బ్రహ్మమని పలుకుచుండుమురా ॥౧॥ అహోమానెవ త్రివిడచీ అరూనంటాక । అహంబ్రహ్మస్మని అనందించుమిరా ॥౨॥ తత్పదమనియేటి తాత్పర్యమంతాదె లసితత్వమసియాని తలచూచుండుమురా ॥౩॥ అయిద్దైదులుయిరుపై అయిదింటి మీరున్న । అయమాత్మ బ్రహ్మమానె అచలామృతం గ్రోలరా ॥౪॥ పరశు

రామ సీతారాములె గురుడాని । పరగ శేషమ్మ జెప్పిన భావమె నిజమనరా ॥౫॥

## ౬ కీర్తన

చెప్పరాని మానిపండూ । అదిచెప్పితె జనులాకు తెలి వయ్యేయుండూ ॥ప॥ పంచాభూతములకు మించీయున్నదిపండూ సంచీతకర్మముల ద్రుంచివేసినపండు పంచాక్షరీ మంత్రం పైనా యున్నదిపండు । పరమాభక్తులాకు పరిపూర్ణమయ్యెండు ॥౧॥ నాదు బిందు కళల నంటకుండిన పండూ । వాదా భేదమూల వదలించిన పండు । క్రోధాగుణంబులా కొట్టివేశినపండు సాధూ సజ్జనులాకు సంపూర్ణమై యుండు॥౨॥ అరిషడ్వర్గములానుఅణచీన వాపండు · అరసి త్రిగుణములాను పెరికివేశిన పండు। ఆశపాశ మూల కోసివేసిన పండు। దాసూలైనవారి దగ్గరనెయుండు ॥౩॥ స్థూలసూక్ష్మ కారణాల మీరినపండు । తుర్యాతీతమై సుషుప్తి జెందని పండు । సురలాకాభేద్యమై చూడరాని పండు । ఆర్యూలైనవారి కానందమై యుండు ॥౪॥ ఐదూ వర్ణమూల కావాలి దాపండు । హరిహరాదులాకు అలవిగానిపండు । అన్నా రామ బ్రహ్మమును భావించిన పండు: అతిగా శేషమ్మాకు అనుకూలమై యుండు ॥౫॥

# ౧౦ కీర్తన

## శ్రీ పరశురామ సీతారామస్వామివారు చెప్పిన వాక్యము

సర్వసూన్యమె బ్రహ్మమయ్యా । వోశిష్య నీకు సర్వ సూన్యమె బ్రహ్మమయ్యా ॥ప॥ సర్వసూన్యమె బ్రహ్మం అరమార లేకవున్నది । సరసాముగాను జూచితె సొజ్ఞాచే తెలియ వయ్యా ॥౧॥ మూడు గుణాములు బాయవయ్యా । అ మీద నున్నా । మూడు వాసనలు బాయవయ్యా । మూటి నాడూమ యున్నా ము క్తి కాంతే మాయా । మూలాము లేని శరీరా మేమి లేదానవయ్యా ॥౨॥ ఆరూ శత్రూలనణ చావయ్యా । నీ లోన యున్నా ఆరు చక్రకములు దాటావయ్యా, మేరు శిఖరామందున్నా మేడమీడికి నెక్కి । మీదా క్రిందా జూచితె మిశితామై యుండు నయ్యా ॥౩॥ అంటి అంటాక యున్నదయ్యా అ రూపామయ్యె కంటికి వెలిగా నున్నాదయ్యా యింటికిలోగాను కంటికివెలిగాను జంటా బాయాక వెనువెంటా నంటున్నాదయ్యా ॥౪॥ పూట్టూ చావూలు లేనీ దయ్యా । ఈ మాటలన్ని వట్టివిగావూ జూడా వయ్యా । ఇట్టి మూటాలుమున్న యెవ్వారు జెప్పలేరు । గుట్టూ బట్టా బయలైనా పోట్టాలొ నుంచావయ్యా ॥౫॥ పగలు రాత్రూలు లేసిదయ్యా । పరిపూర్ణమయ్యె బాధా లేమీయు లేనీ దయ్యా । సాధూవర్యాల దగ్గర సంపూర్ణమైనాదయ్యా । భేదా భేదాములాను ఛేదించి వున్నదయ్యా ॥౬॥ రేపూ మాపూలు

లేనీదయ్యా । అపారా బ్రహ్మము । పాపాలోదాపూ అయినా దయ్యా । ప్రాపూ దాపూను లేకా కోపా తాపము లేక । యే ప్రొద్దు జూచినాను । ఏకామై వున్నాదయ్యా ॥౭॥ బయాలే భావాన సేయారయ్యా । బయలూలో బయలై పదమానందాము జెందారయ్యా । ఇట్టిది అని దాన్ని వర్ణింపా రానీదయా । అట్టి వస్తూవ జనులా కనుపడకా వున్నాదయ్యా ॥౮॥ ఎరుకా మరూపూలు లేనిదయ్యా । ఆ పర బ్రహ్మము। యెప్పాటివలెనూ వున్నాదయ్యా । గొప్పా కొంచాముగాకా కోరీ కేమీయు లేకా । తప్పూ వప్పూలు లేక దగ్గార వున్నాదయ్యా ॥౯॥ ఇందందూ అనకా వున్నాదయ్యా । సందూ గొందూల సమారానమయ్యి యున్నాదయ్యా । నిందా నిందాలు లేక పొందూ కేమీయు లేకా । ఎందెందు జూచినా నీకందందె వున్నాదయ్యా ॥౧౦॥ సేయారాని పనులూ సేయాకయ్యా। సద్గురు నీ సేవాజేసీయుపరమూ నొందా వయ్యా। నా చెల్లెలైన శేషమ్మ జెప్పిన భావమంత । చెవినాటి వినవయ్యా । శ్రేష్టూడ వౌదువయ్యా ॥౧౧॥

## ౧౧ కీర్తన

సద్గురు సేవకులరండీ । మీరు సర్వము బ్రహ్మమనండీ । సాధుల సేవించండీ । మీరు సంతోషము నుండండీ ॥౧॥ అంగడి చేరంబనుటా । యీ దేహముండదని వినుటా । గురు స్మరణ జేయునీనోటా । దురితములు జేరవిచ్చోటా ॥౨॥ మలమూత్రం

ములు గుంటా । మాంస రక్తములపెంటా । దీని మమతవిడిచినీ వుంటా । నీవుమరల బుట్టకవివెంటా ॥౩॥ అష్టపాశములబట్టి అరిషడ్వర్గముగొట్టి । యివి వట్టివనుచు మనసుబట్టి। నీకు బట్టబయలెమరిగట్టి ॥౪॥ పంచకోశములజుట్టి । మీరు పంచేంద్రియముల నేట్టి । పరిపూర్ణముచేపట్టి । యీ పాపములను బడగొట్టి ॥౫॥ పరమభక్తి మీకుండీ । ఆ పరమపదము దెలసుండీ సీతారాములె గురువనుచుండీ । నీవు స్థిరమానసముననుండీ ॥సద్గురు॥ ॥౬॥

## ౧౨ కీర్తన

చాలునమ్మా సంసార సుఖము చాలునమ్మా । చాలు చాలు సంసార సుఖమూ। మేలులేదు మేననిత్యము। సారెసారెకు గురుజేరి। సత్యము గవర్తించవమ్మా ॥౧॥ వొద్దువొద్దు కుజనుల పొందు వద్దువద్దు । మొద్దువలె యెగిరింతలాడెవు । వద్దు వద్దని చెప్పగాను । కొద్దిగుణములుమాని గురునివద్దజేరివుండవమ్మా ॥౨॥ పట్టబోకు। పరులనివారనిమాటబోకా। వట్టిమాటలుగావు చెప్పేద । ఘట్టిగా చెడిపొయ్యేదవు విను పట్టు విడుపులులేని వస్తువు। దిట్టముగ తెలుసుండవమ్మా ॥చా॥ ॥౩॥ నిందదేల పొందెదవూ నీ అంద మేలా। సుందరీమణు లందరికినీ వందనంబులు జేసినీ మందిరంబుననుండి గురుగోవింద నామము తలచవమ్మా ॥౪॥ బోటులెల్లా నవ్వేదరూ నీ పాటుకెల్లా। కోటి విధములజెప్పననువిన పేటికీ మదముని నోట సద్గురుస్మరణచే ముమ్మాటికీ

తరియించవమ్మా ॥చా॥ ॥౫॥ చేష్టలుడిగి। సద్గురువూల శేవజేసి। శరణుజేసి పరముజెంది। చేసిచెయ్యని దానవయ్య। శేషమ్మ జెప్పిన వాక్యమందున। శ్రద్ధబాల పుంచవమ్మా॥ చా॥ ౬॥ పంత మేలా। పరులకు నిస్వాతంత్రమేలా। పరిపరీవిధములను జెప్పిన, పరువు బారుచు పొయ్యేదవు నీవు। పరశురాముల సీతారాముల పాదములువమ్మికె నీకు ॥చా॥ ౭॥

## ౧౩ పూరిరాగం - ఆట తాళము

చాలునే సంసార సాగరమూ। మానసమ మంచి మార్గమున్నది మరియు గోప్యమూ ॥ప॥

యిక్కడక్కడ తిర్గిబోలూ చిక్కములో చిక్కియున్నావు పెక్కుమాయా విద్యలలోను చిక్కకె దక్కకె। మొక్కకె చాలునె ॥౧॥

నాడునేడని యనక యున్నదీ। నాల్ దిక్కులాకు నాటుకొనినా నమ్మకెనాదీ। వాటమైనా। రాజ మార్గము। సూటి దెలియా నేర కున్నవు। మాటి మాటికి। జననా మరణాము। మానాదే। పూనాదే। వినాదే ॥చాలునే॥ ॥౨॥

ఇట్టిదాట్టిది యనక యున్నదీ। ప్రపంచామంతా వొట్టి దాని నమ్మయున్నాదీ। ఇట్టి భావమూనుమునూ। యవ్వరూ జెప్పాగలేదే। అట్టి మార్గాము తెలిసితె నీవు। పుట్టావె। గిట్టావె నెట్టవే। చాలునె ॥౩॥

అంచు యుందాని । యనక యున్నదీ । పరమాత్మ రూపా మెందుజూచిన సందులేనిది సందేహమూ లేదూ చూడూ సర్వాంతార్యామై యున్నదీ మందబుద్ధి విడచితె దాని పొందేవే। అందేవే । చెందేవే । చాలునే॥

చక్కనీ మార్గామును జూడవే। సంసారమంత యక్కడీ నుంచొచ్చె చెప్పవే। మక్కువతో । గురు వాక్యమూ। మన్ననా సేయుచూనుంటే। దుఃఖమూలుబోయి । బయలులో చిక్కేవే । దక్కేవే । యెక్కేవే ॥చా॥౫॥

కోశమూలబాసి యుండవే । దేశికులాజేరీ దోశలొగ్గి దాశి వయ్యేవే ఈ షణాత్రయములానూ । విడచియుంటేను నీకూ । శేషమ్మ చెప్పినభావము। చెందేవే పొందేవే అందేవే॥చా॥౬

భయ భక్తుల చేతదిరుగనే । పరశురామూసీ సీత రామూల నేవజెయ్యవే । వాద భేదామూలు మాన్ని బోధ జేశి బాధమాన్పి పరమా గురుపూల ముందార నీవు। పాడావే । ఆడావే । వేడావే చాలునే ।

## ౧౪ బిలహరి రాగం- ఝంప తాళం

పెద్దలా శేవయందు బుద్ధి నిలుపుకో వలెన్। యిద్దరీ నడుమ యున్నయుక్తి దెలియగావలెన్ ॥పె॥౧॥

మూడు మూడు మూటిజాడ ముందు తెలియగావలె । మూటి నడుమా యున్న ముక్తి। కాంతగనుగొనా వలె ॥పె॥౨

పంచవింశతితత్వ । బాటదెలియగావలెఁ పంచ సంస్కారమునకు । మించియుండగా వలెఁ

అంతరింద్రియము లణంచి । ఆత్మ దెలియగా వలెన్ । సంతసమును గురునిజేరి । సన్నుతింపగావలెన్ ॥పె॥౨॥ వాద భేదములు రెండువదలి యుండగావలెఁ। నాదములో నాదువిని। ఆనంద మొందగావలెఁ ॥పె॥౩॥

ఆత్మశుద్ధిజేసి ఈ । యహములేక పోవలెఁ। అరిషడ్వర్గములందు మనసు । అంటక యుండవలెఁ ॥౪॥

అండమూలోవున్న రూపు దండిదానుకో వలెఁ । దాని ఖండన జేసేటియుక్తి । గనవలే సద్గురు కృపఁ ॥పె॥౫॥

బయలులో బయలు ని ర్బ్రయలు తాను గావలెఁ బయలు యందు భావముంచి । పరముజెందగా వలెన్ ॥పె॥౬.

పరగ శేషమ్మ జెప్పిన । బాటదెలియ గావలెన్ । పరశు రాముని సీతారాముల భజన సేయాగా వలెన్ ॥పె॥౭

## ౧౫ రేగుప్తి రాగం - అట తాళము

వేంచేసె నమ్మాలారా । సాద్గురు రాయూడు । వేంచేసె నమ్మలారా ॥ప॥

వేంచేసే నమ్మాలార । వేదమనే అందోళికె మెక్కి । సాధనా చతుష్టయములు। బౌరులు వేయగాను। వెంచేసే ॥౧॥

పేరులయ్యేనవారికి। త్రివిధా దీక్షలొనర్చి। తీరైన ఆమ నస్క భావము। ధీయుతముగను। తెలిపెదననుచును ॥వే॥౨

మూడూ లయినా వారికి। మూర్తి మార్గా మిచ్చి। మూలమూ లేని శరీరా। మేమీలేదాని చెప్ప ॥వే॥౩॥

రాగ ద్వేషామూల। రావొద్దు పద్దానూచు। బాగైన పరిపూర్ణ భావము। బాలులకైనను తెలిపెదననుచును ॥వే॥౪

శరీరమూ లేక యున్న। శేషమ్మ హృదయామందు। చేతన్యమూ లేదని తెలుసుకోండి జనులారా యనుచూ ॥వే॥

పరమా భక్తులందారు। పరివారమూలు సేయ। పరశూ రామూని సీతా రాములు ఇచ్చటికి। వేంచేసె నమ్మలారా ।౫।

## ౧౭. ఆనంద భైరవి - ఆట తాళము

ఇటువంటి గురుసేవా। యెవరికి దొరకేని। కుటిలా రాహితులయిన గుణవంతులకెకాక ।ఇ॥ప

పద్మాసనమూ వేసి। వణతీ రమ్మానీపిలచి। ముదమూన శిరాముపై। కదళీ హస్తాముంచాను ॥ఇ॥౨॥

తను మాన ధ్యానాములు। ధారాబోయ మానేను। తరమూగావట్టి మాయను। తలువా వద్దనిచెప్పె ॥ఇ॥౩.

మూడు దీక్షలొనర్చి। ముందుగా నావాల జేర్చి। మూలమూలేని శరీరా। మేమీలేదాని చెప్పె ॥ఇ॥౪॥

పరమా రాహస్యామీది । మరువా వద్దని చెప్పె । పరమ
రామునీ సీతా । రామూల జేరుమానె ॥ఇటు ౬॥

## ౧౭ పంతువరాళి - ఆట తాళము

బ్రహ్మైక్యమెట్లూ ఘటించూ । వారి ప్రేమ ఎందుకు
తొలగించూ । ప॥

బ్రహ్మైక్యభావము బ్రహ్మవేత్తల కెరుక । ఇమ్మహిలో
నుండే హీనుల కేమెరుక ॥బ్రహ్మైక్య॥౧.

వేదాముల చదివీననేమి । వెనుక – యాగాముల్ చేసీన
నేమి । వేదవేదాంత వినోదము తెలియాక । వాదభేదములాలు–వద
లాని వారికి ॥బ॥౨॥

ముని వేషములు దాల్చితేమి । ముక్కూ మూయూచు
గొణిగితేనేమీ। ముక్తి మార్గామానే మాలమూ దెలియాక ।
మూఢ చిత్తులయ్యి । ముణిగేటి వారికి ॥బ్ర॥౩.

యాత్రాలు దిరిగీననేమీ । యోగభ్యాసాము చేసిన నేమీ।
నేత్రమందున గురు సూత్రాము దెలియాక । క్షేత్ర క్షేత్ర జ్ఞాని
తెలియాని , వారీకి ॥౪॥

సాధూలమని పల్కితేమి । సంసారాము విడచీన నేమీ ।
పూర్ణ భావమనే సంజ్ఞాయు దెలియాక । పుట్టూచూ చచ్చూచు
పొరలేటి వారీకి ॥బ్ర॥౫॥

పండితూలా మంచేసేమి। మేము-భక్తులామనిపల్కితేమీ పరశురాముని సీతా। రాములా దెలియాక । పాప పుణ్యములా పడిపొయ్యె వారికి ॥బ॥౬॥

## ౧౮ సౌరాష్ట్రి రాగము-జంపె తాళము

వినర బ్రహ్మైక్య బోధంతా। నీవు వినకుంటె చెడుదూవు వింటే మేలంతా ॥ప ౧॥

తీర్థ యాత్రలు తిరుగబోకూ। నీవు-త్రిగుణముల బట్టి-దీకొల్వనివకూ వేదాంత మార్గాల కొరకూ। నీవు। సాధుసజ్జనులతో సాహవాస మిడకూ ॥వినర।౨।

కర్మ కర్తృత్వాల మీరీ। నీవు నిర్మలంబైనట్టి నిర్గుణము జేరీ। మనసు సొమ్మశిల్లగ జెయ్యరోరీ। నీవు నెమ్మదిగజేకొమ్మి యిమ్మైన దారీ ॥వి।౩॥

సారెసారెకు జెప్పనేలా। నీవు-సగుణ నిర్గుణములా జాడ గనవేలా। సంసార మంతయూ దేలా ।నీవు। సంశయంబులుమాని జరుగు దాగేలా ।వి।౪।

ఘడియ ఘడియకు నిమిషమైనా। నీవు ఘనమైనసద్గురుల గలయకేమైనా। పరము దొరకదు కొంచెమైనా। నీవు బయలులో బయలయ్యి బ్రతుకు యేమైనా ॥వి॥౫.

ఇంద్రియా విషయముల బూనీ । నీవు ఇహపరా సౌఖ్యములు కోరితే హానీ। వినుము జీవన్ముక్తి దానీ నీవు విడువకా యుండుచే-యిదీ మంచిది దానీ ॥వి।౬

ఈ షణ త్రియములను విడచి నీవు దేశికుల కృప చేత తెలివొంది నడచీ । హీన గుణములనెల్ల గెలచీ జగము యిరువు జేసుకయున్న । మాయనే గెలచీ వి।౭

సేవ జెయ్యగరోరి మనమూ । గురునిశేవ జెయ్యకపోతె చెడిపోవుటనుమూ । సేవకుడగమ్మి ఈ దినమూ శేషమ్మ చెప్పినమాట వింటేనె–ఘనమూ ।వి।౮

పరుల మాటలు చెవుల వినకా । నీవు పగలు రాత్రులు గురుభజన యేమరకా। పరిపూర్ణమిదియు గాదనకా। పరశురామ బ్రహ్మ మెగురుడు – స్థిరమాయె గనుకా । వినర బ్రహ్మైక్య బోధంతా ౯।

## ౧౬ మోహన రాగం-అటతాళం

ఏమి జెప్పుదునమ్మా । సద్గురు మార్గ–మేమి జెప్పుదు నమ్మా ।ప।

ఏమి జెప్పుదునమ్మ యేమాన రానిది । నీమ కర్మము లేని విర్మాల గురుమార్గ ।మే॥

ఇందు అందు యనక యెందూన జూచీన । సందులేక వున్నదీ ఆది నాల్గు సాధానముల మీరిందీ । అంద పొందరాక । ఎందుయేమిలేక। సందేహామూ లేక సర్వంతానై నాది ।ఏ।

ఆవలీవల యనక యేవాల జూచీన। ఆవరించి యున్నదీ ఆరూపమై ఆనందమయమైనదీ। కేవాలముగానూ ఈ భావాము దెలసితె । ఖేదమోదములానే బాధ లేకున్నాదీ ।ఏ।౩।

కొన్ని దేశములాని కొన్ని కాలములాని । యన్నాబడక యున్నదీ వన్నెలుగాక సన్నుతింప రానిదీ । వున్నాదీ అన్నాదీ విన్నాదేమియు లేక మిన్నూ మన్నూలాలో మిళితమై యున్నాదీ ।యే।౪।

వసుధా లోనణగాక వార్ధిలో మునుగాక వహ్నీన గాలానిదీ । వాయువుచాత వణుకుబట్ట రానిదీ । విశదముగాను ఈ వివరాము దెలసితె – పసిబాలాదులాకు – బయలై యున్నాదీ ।వ ౫

వర వశిష్టులాకు – వాల్మీకాదులాకు – వర్ణింపరాకున్నదీ వాసవాది వరుల కందరానిదీ పరశురాముని రామ–బ్రహ్మము కృప సేయ–వరగ శేషమ్మాకు– బయలయ్యి యున్నాదీ ॥ఏ।

## ౨౦ ఆది తాళం

నిర్వికారమై నిశ్శబ్దంబై । నిండి యున్నదది తెలియరయా । నీవునేననే భావమంతటను నిలువలేదది చూడరాయా । బట్ట బయలుయా పరమ పదంబని భావము లోపల యుంచరయా। ఇట్టిదియని వర్ణింపరానిదని గుట్టుదెలసిసుఖమొందరయా. ని।౧

కన్నుల జూడగ వన్నెలు గాకను । వెన్నెల బయలై యున్నదయా॥ సన్నుతింపగను శక్యముగాకను । సర్వసమంబై యున్నదయా ।ని।౨

పరులు బలికినా పలుకులు పలికితె । పాపములో బడిపోదు రయా । పర బ్రహ్మమునె భావమంతటను పరిపూర్ణంబై యున్నదయా ॥ని౹౩॥

జనులు జేసినా శాస్త్రము నమ్మితె । జనన మరణములు జెందునయా । జనకుడు శుకునకు చెప్పిన భావము । చలనము లేకను యున్నదయా ॥ని౹౪౹

పరశురామునీ రామబ్రహ్మం । భావందిబియని తెలియ రయా స్థిరముగ శేషమ్మ చెప్పిన వాక్యము । చిత్తమందునను ఉంచరయా ।ని౹౫

## ౨౧ ఆది తాళము

బయలే బ్రహ్మమురా । కేవల బయలే బ్రహ్మమురా । బయలే బ్రహ్మము పరమగురువులా। పదములు నమ్మిన పరమ భక్తులకు ।బ౹౧।

ఎన్న వశముగాదూ మరిదాని । కన్న ఘనములేదూ । మిన్ను మన్నులకు మీరియున్నదది । సన్నుతి జేయను జాల కుండినది । అన్ని దేశముల అలముక యున్నది బ౹౨

చూడ వశముగాదూ । ప్రూడ్యుల చూపు నిలువలేదూ । ఏడ వెదకినను యేమి లేనిదది । ఆడ ఈడ యనకంతట వున్నది । చూడ చూడగా బోధ్యంబైనది బ౹౩।

మూఢులైనవారూ। దానీ మూలముగనలేరూ । మూడు గుణములను ముంచివేసినది । మూలమూయను మునుపె తోలి నది । ముక్తి మార్గముకు మూలమై యున్నది ॥౪॥

మండలముల నుండి । అది బ్రహ్మాండమంతనిండి తిండి తిననిదది పండుకోనిదది । పండిత జనముల కండై యున్నది కుండిలి మీదను గూఢమై యున్నది ॥౫॥

క్రోధ గుణములేకా అది సమ్మోద మందబోకా వాద భేదములు వదలియున్నది నాదు బిందుకళ లంటకున్నదది సాధు జనులకు సంపూర్ణమైనది ॥౬॥

పరశురామ సీతా । రామ బ్రహ్మము కృపచేతా । పట్టుబడినదది పరుగులెత్తదది । పరగ శేషమ్మ । భావమందున్నది॥ బయలే బ్రహ్మ॥ ॥౭॥

## ౨౨ రాగము మధ్యవతి అట తాళం

శూన్యముగావలెరా । తన మనసు దానిలో । లీయ్యము గావలెరా ॥ప॥

శూన్యము గావలె మనసూ । ధాన్యము సేయగవలె , చయ్య చయ్యన గురుని పదముల । సాష్టాంగ మొనరించు చున్నది॥ శూ॥౧॥

జీవుడానవలెరా । త్రిగుణాత్మకండైన । జీవుడే దేవుడురా జీవుడూ దేవూడు లేదని। స్థిరముగతనమదికి తెలిసియు త్రిగుణ రహితంబైన బ్రహ్మమందు నైక్యము జెందుచున్నది॥ శూ॥౨॥

దూషణా జేసినా నిన్ను విశేషా మనుకోవె మనసా ।
ఈ షణాత్రయామూలాను విడిచి యుండావె మనసా ॥౩॥

పొట్ట కొరకు నరులా చుట్టూ దిరుగాకే మనసా
పట్టా విడువ్రాలులేని బయలు చెందావె మనసా ॥౪॥

చదువులెన్ని చదివినా సారమేమిలేదె మనసా చావూ
పుట్టూకాలూలేని చదువు చదువావే మనసా ॥౫॥

కోటీ విద్యాలు నేర్చిన పొటీ కొరకే మనసా। నీటూగా
సంసారములో । నూటీ దెలియావే మనసా ॥౬॥

అప్పుడప్పుడు గురు స్మరణా తప్పకా చెయ్యావే
మనసా । అప్ప గూరూ సాదా ధ్యాన్నము యెప్పుడూ యేమా
రకే మనసా ॥౭॥

ఛీఛీ పరులా చేతులో చిక్కాబడాకే మనసా । శివ
రామ దీక్షితూల చిత్తమందుంచే మనసా ॥౮॥

పరశురాముని సీతారాముల ధ్యానమందుండీ మనసా
పరగా శేషమ్మ చిత్తము పరమానందముకొంచె మనసా ॥౯॥

## ౨౪ ఆనంద భైరవి-ఆట తాళం

లేదు లేదు ఇది తెల్పక మోక్షము । లేదని తెల్పెడి జను
లారా । కలదు కలదు కైలాసము కన్నుల ! కనుగొనుడీ
సూ జనులారా ॥౧॥

దృక్కుల లోపల దృశ్యమంతయూ । తూలిపోవుటాయ।
ఎక్కడ జూచిన బ్రహ్మమయంబిక । యేమిలేకపాయా ॥ఇ॥౩॥

మూడవస్థలు జెందిన పురుషుడు । మణిగి పోవుటాయా।
మూలములేని శరీరమంతయు ము క్తిజెందుటాయా ॥ఇం॥౪॥

ధనము ధాన్యము మీది ప్రేమలూ । తగులకనేపాయా ।
తల్లిదండ్రిమరి దైవముగురుడని। తలచుటఘనమాయా ॥ఇ॥౫॥

తనుమన ధనములు గురునిసొమ్మని। ధారబోయుటాయా
తరముగాని సంసార సముద్రము । దాటిపోవుటాయా ॥ఇ॥౬॥
సేవజేసిగురుకీలకమెరిగితె। శ్రేష్ఠండయిపాయా। శేషమ్మ
జెప్పిన వాక్యము వినకా । చెడిపోవుటలాయా ॥ఇం॥౭॥

పరమ పథంబును యెరిగిన పిమ్మట। భక్తుండయిపాయా
పరశురామ సీతారాముల కృప। పరిపూర్ణంబాయా ॥ఇం॥౮॥

## ౨౬ శంకరాభరణం-ఆట తాళము

కలగాదుఇకను। ఈ బ్రహ్మపదవి। కలగాదుఇకనూ ॥ప॥

కలగాదు ఇకను ఈ కలయూగ మందున । కల్లగాదు
వినుడి । ఘన బ్రహ్మ పదవిని ॥క॥౧॥

అది యెట్లంటేనూ । చెప్పెద మీకు ఆనందముగనూ ।
హరి హరాదులకైన అలవిగాని బ్రహ్మ । మందుజేరి దాని ।
పొంది సుఖించండీ ॥క॥ ౨॥

మూఢత్వంబుననూ । మూర్ఖులయ్యీ । ముందు తెలియ కనూ । మరికి దేహముచూచి మురయుచు నున్నారు । ముక్తి మార్గమనే । మూలము దెలియాక । కలగాదు ॥౩॥

అధికారాల మనుచూ । అడవిలోబడె । ఠానందమనుచూ । ఆశపాశ బద్ధులై । చెడిపోవూచూ । అంధకార బంధముననూ చిక్కున్నారు ॥క॥౪॥

సాక్షాత్కారముగా । సద్గురు కృపా । సాధించ లేకా । సారములేదు సంసారముయని యమృత । సారాము గ్రోలేటి। చవిగాన కున్నారు ॥క॥౫॥

శాస్త్ర వాసననూ । శేషమ్మ మాట । చెవి నాటకానూ । చేరి సద్గురుపూల । సేవచేయ్యకాను । క్షేమ మెరుగక జనులు చెడిపోవు చున్నారు ॥క॥౬॥

పరశు రాముని । సీతారామ । పరబ్రహ్మంబాని । పరి పరి విధమూల । ప్రస్తుతిసేయూచు । పరమ పదంబనె । బయ లెరుగ కున్నారు ॥క॥ ౭॥

## ౨౪ త త్వ ము

నమ్మరాదుగదవే । నీ మాటలు । నమ్మిక విని పోవె । వన్నెలు చిన్నెలు యేలజేసెదవు । నేడు గురుని సొమ్మైతివనే జెల్లా ॥౧॥ బ్రహ్మ విష్ణాదులను । రుద్రుని పరగ దేవతలను ।

చంద్రుడూ లెవ్వరె । నా మనసాయీ । ధారా పుత్రాదు లెవరే । తనువు నిత్యామాని ధనము కాంచెవు తర్లిపోయేవేళ్ళ తన వెంట రాబోదు ॥४॥ పరువూ బారక యుండావే యీ పాప సంసారాము విడచి యుండావె । పరిపూర్ణ బోధ తెలసి పర మానందము జెంది పరశురాముల శీతారాముల దలువావె ॥౫॥

## అజ తత్వము

ఆనందమాయా । నా మనసెంతో । అతిమోదమాయా, ఆనందమాయెను । యీ అందమునుబాయ సచ్చిదానందమును సంపూర్ణమాయెను ॥౧॥ త్రిగుణములుబాయా। దినదినము పాచి। దీసినట్లాయా । తిరైన మనసెందు తిరుగాక పాయెను। తియ్యాని మామిడిపండు తిన్నట్లాయెను ॥౨॥ అన్నాదిబాయా । అలాప్ర మనెది నదిపీడిపాయా । అనుదినము గురుశేవా । అనుకూల మాయెను । అమృతపానము నాకు అనుభావ మాయెను ॥౩॥ కన్నాదిబాయా । కామా క్రోధములు । కడకేగిపాయా । కలలో వస్తువులన్ని కానరావాయెను కధళీ ఫలంబూను కభళించినట్లాయె ॥४॥ అంతా తానాయా । ప్రాపంచము । యెంతో వింతాయా । అంతారంగమునందు సంతోశమాయను ఆనందవార్ధిలో మును గాడమాయెను ॥౫॥ పాపాయేపాయా। పరశురాముల శీతారాముల నమ్మికాయా । ప్రేమతో శేషమ్మ చెప్పిన వాక్యాము। పంచ ధార తేనే మించినట్లాయెను ॥౬॥

## ౩౦ తత్వము

కూడాదు గురువాజ్ఞ ఇవనిదె గురువయ్యి మగుడి శిష్యుల జేసుటా పడరాని పాటెల్లపడియు నరకంబూన పరితాపించగ జేసొట ॥౧॥ ఇపుడేమీలేనట్టు । ఉపకారమైనట్టు విపరీత మొందు సుమీ । కపట నాటకుడై తె కనిపెట్టి యున్నాడు కల్లా నిజములు రెండునూ ॥౨॥ గురుడునరుడుగాడు। హరుడాని శృతి స్మృతులు మొరలు పెట్టుచునుంటగా । నరులు కొందరు తమకు తామే గురువుల మనుచు మురయుచు నుండేదరూ ॥౩॥ గురువాజ్ఞ అయ్యితె గురు చిహ్నములు అన్న । గురుతులుండుటెయు సాక్షి ధరకల్లా గురువూలు దారి తప్పియు నడిచి చేరారు పరమం దూన ॥౪॥ బాధా గురువులే కాని । బోధా గురువులు కారు । వాదులాడెటి వారెల్లా తుదిముట్టకను పలులదరిజేర్తు మందూరు । ముదమొంది నరులాతోను ॥౫॥ జ్ఞానా నుష్టానాము । ధ్యానా పరులకే చూడ। మానూగ నధికారము । పూని ఇష్టా సిద్ధీ పొందాక గురువాజ్ఞ చెందాక యెటు కల్గూనూ ॥౬॥ ఆకాకొరకె గాని దేశాము లన్నియు మోసాము కొనకిచ్చూనూ శేషమ్మ చెప్పిన ఆజ్ఞకు లోబడి క్షేమా మెరుగనైతిని ॥౭॥

## ౩౧ మేలుకొలుపు

తెల్లవారెను మోహ తిమిరం । వెల్ల బాయెను జ్ఞాన

ఉదయం । ఎల్ల ప్రపంచంబాయె । తన మనసెల్ల స్థిరమాయె
ఆత్మ మేలుకోవే॥ ౧.

మూడు గుణములు । మునిగిపాయను । ఏడు ధాతువు ।
వెనుక బట్టెను । ఏది యేమియు । లేకపాయను । ఎరిగి మేల్కో
నవే। ఆత్మ॥ ౨.

అష్ట తనువులు ఆడవిబట్టెను। అష్టమదముల హామిక మణ
గెను , కష్టసుఖముల కాంక్షదీరెను। ఘనత మేల్కొనవే ॥ఆ॥ ౩

అష్ట ప్రకృతుల ఆటలుడిగెను। అష్టపాశములపుడెవీడెను,
ఇష్టమేమియు లేకపోయెను। ఇపుడె మేల్కొనవే ॥ఆత్మ॥ ౪.

వాసనాత్రయ మొదలెపాయను । ఈ షణత్రియ మిపుడె
వీడెను । విన్నదేమియు లేకపాయెను। వేగమేల్కొనవే ॥ఆ॥ ౫

సాగరంబుల చప్పుడుడిగెను। వాదభేదము వదలిపాయను
నాదమప్పుడే నశ్యమాయెను । నయమె మేల్కొనవే ॥ఆ॥ ౬

మండలములనె మమత మానెను । కుండలస్థలి కూలి
పాయను॥ పండువెన్నెలభావమాయను। బరగ మేల్కొనవే ।ఆ॥ ౭

మనసు బుద్ధియు మరల జనియెను। మానిపాయను జనన
మరణము । మమత ఏమియు లేకపాయెను । మరియు మేల్కో
నవే ॥ఆత్మ॥ ౮.

సహజ శేషమ్మందేకమాయెను । కులము గోత్రము లేకపో
యెను। కుటీయుడుములు సమమైయెను।గురుతెలుకపాయెఁ ॥అ॥౯

పరమ రాముని సీతారాముల । భజన నిత్యము చేయుటా
యెను । బాగుగా శేషమ్మ ధ్యానము। బయలులోఁగలిసెఁ ॥అ॥౧౦

## ౧ మంగళ హారతులు

కప్పురంపు హారతివ్వరే గురురాజయోగికి। కప్పురంపు
హారతివ్వరే ॥ప॥

కప్పురంపు హారతివ్వరే। రెప్పల నడిమి నేర్పరిగలసి ।
అప్పుడిప్పుడనక మీరు । గొప్ప కన్నుల కొల్కొదీర ॥కప్పు॥౧

చెవులు కన్నులు ముక్కుమూసి। శరీరములో శాతకుంభపు
కాంతిజూచి । చైతన్య మనెడివాని సేవజేసి మాయబాసి । ఆశ
పాశములుగోసి । దేసికోత్తముచేరి మీరు ॥కప్పు॥ ౨

రెప్పవాల్చక రెండు చూపులూ కనుబొమల నడుమ
తప్పకుండనిల్పి మాపులూ । చెప్పతరముగాని వన్నెలు చప్పుడు
సేయకచూచి గొప్పగాను ప్రేయుచున్న ఓంకారము
గలసి మీరు ॥క॥ ౩.

పంతమునను ఊర్ధ్వ దృష్టిని । యెక్కినిక్కి। పక్షమాభి
ముఖముగాదీని। కొంత సేపునిలిపి అచటి వింత వింతలన్ని చూచి।
సంతోషమాయనను చు స్వామిసద్గురు చేరిమీరు ॥క॥ ౪.

కన్నులు సగము మూసి చూపుచూ భ్రూమధ్య మందు వెన్నెల పైటచేర్చి మనమును సన్నపు ఓలము నందునుండి । సహస్రార చక్రమునను ఉన్న పరమాత్మనెపుడు । ఉపముచే తనే గ్రహించి ॥క॥ ౫.

పరిపూర్ణ బోధ దెలిసియూ । పరశురాముని సీతారాముల మీరు కొలచియూ । పదవడి శేషమ్మ చెప్పిన భావమంత దెలుసుకొని పరి పరి విధములను బోక । పరమ నందము నెందు చున్నది ॥క॥ ౬.

## మంగళ హారతి

మంగళమని పాడారమ్మ। మంగళ మనరే మీ మనసు చెలించాక । పొంగాచు భ్రూమధ్యంబూన నుండి ॥మం॥ పంచ వింశతి తత్వామనే పద్మములోన। పంచె వన్నెలుదీర్చి। అంచిత ముగ బోధాంతమందు చెంగించిన సహస్రాను పంచాన జేరుకా ॥మం॥ మూడు మండలమూలు। దాటుచు కుండాలిపైని పంచు వెన్నెల చూచుచు । అండ పిండ బ్రహ్మాండ బాండామూల । నిండీ వెలుంగాచు నుండిన గురునాకు ॥మం॥ మంటీ మంటీ నందు మార్గాము మెరిగియు । కంటి లోపల వున్నావంటీ వెల శీతా నంటాక పరమై ఘంటా నాదాము। ఘణఘణా మ్రోయగ ॥మం॥ బయలే భావనజేయుచు బయలుగా బయలై పరమానందమూను జెందాచు । పరశురామ పర సీతా రామయ్యాను ।

వరి హారి విభవముల ప్రస్తుతి జేయుచు ॥ మంగళమని పాడారమ్మా॥

## హారతి

ముత్యాల హారతు లివ్వారమ్మా। ముని కన్యాలారా।
ముత్యాల హారతు లివ్వరమ్మా ॥ప॥

ముత్యాల హారతు లివ్వరె। ముదితాలందరు గూడి। ముక్తికాంత సరిలేరు మూడు లోకాములవారు ॥ము॥ ౧.

పరిపూర్ణమనే పళ్ళెముజేసీ। పంచా వన్నెలా పద్మ మందా లోపలా వ్రాసీ పగలు రాత్రులనకా వెలిగే పారం జ్యోతినే చూచి। పాదుగాయున్న మోహాంధాకారము తొలాగా ద్రోసీ ॥ము॥ ౨

మూడు మండలామూలా మీరి। నడినాడీలోపలి జూడ దెలాసీ దానిజేరి। వాడాలో బారేటి మూడూ యేరూలా దారీ। ఏడు అంతస్థూలపై మేడాలోజేరి మీరు ॥ము॥

వాదా భేదామూలాను మానీ। సంపూర్ణమైనా బోధా చాలాతో మీరు వీని। ఈ దారా దారి పొయ్యేదాని పాదుగానె నిలుపూకోని। వేదాంతా భావామే పూనీ యేమీయు లేదాను కోసి ॥ము॥ ౪.

యెన్ని జెప్పినగాని వినరేమమ్మా తన్నాదా దెలసితె తానె పరబ్రహ్మ మవునమ్మా। కన్నులా యందున్న యట్టి కారణామె మాయనమ్మా। అన్నదీ విన్నాది లేక ఉన్నదే ఉన్న దన రమ్మా।ము॥ ౫.

పాడియాడీ గురునీ మీరు వేడి। పరశురాముని సీతా రాములా మీరుగూడి ప్రేమాతో శేషమ్మ జెప్పిన పాటలన్నియు పాడి। భవ బంధామూలా వీడి బయలందె వోలలాడి ముత్యాల హారతు లివ్వారమ్మా॥ ౬.

## ౪ హా ర తి

నిర్వికారాయ సకల। నిత్య ము క్తిదాయకాయ నిర్గుణాయ నిర్మలాయ నిత్య మంగళం।ని॥ ౧

సగుణ నిర్గుణ రహితాయ। సంకల్ప వర్జితాయ। సర్వ సాక్షి తీతునకు నిత్య మంగళం ॥౨॥

సత్తు చిత్తు సమసిపాయ శత్రు సంహారణాయ। వ త్తిలేని దీపము నీ కిత్తు మంగళం।ని॥౩.

చేష్టలన్ని ఉడిగిపాయ చేసేదేమి లేకపాయ శేషమ్మ మనసు మీలోన చేరె మంగళం॥ ౪.

పరిపూర్ణాయ సకల భవ్యదివ్య రూపాయ। పరశురామాయ సీతారామ మంగళం ॥ ౫.

నిర్వికారాయ సకల నిత్య ముక్తిదాయకాయ। నిర్గుణాయ నిర్మలాయ నిత్య మంగళం॥ ౬.

## గద్య

శ్రీ మత్పరశురామ శ్రీ నరసింహదాసుగారి సోదరియగు
శ్రీ శేషమాంబ విరచిత బ్రహ్మైక్య బోధ
ద్వి పదవాక్య ఉత్తర భాగము
పరమ తత్వము లు
మంగళ హారతులు
సంపూర్ణము.

ఓం

శ్రీ సద్గురవే నమః

## శ్రీ పరశురాముని సూరయ్యగారు రచియించిన

# పద్య రత్నావళి

నాదాంతము బ్రహ్మ । నక్షత్రమాల

కం॥ శ్రీయును సంపదయును హరి । యేయువిధంబుల నొసంగి
వేడుక తోడన్ । ధీయుతునిజేసి నన్నును । మాయా
రహితునిగ బ్రోవు మహిలో రామా 1

కం॥ నన్నయ భట్టారకునిని సన్నుతి యొనరించి తిక్కశర్మ
తలచి శ్రీ। మన్నను గొనియాడియు నే । పన్నుగ భజించి
చెప్పదలచితి రామా॥ 2

కం॥ శతకం బొక్కటి మీ కృప అతులితముగ బొసంగు కతన
నాంధ్రస్తోత్రుల సం। స్కృతముల మౌక్తిక రత్నా యుత
శతకంబనగ నూత్న వసనిలో రామా॥ 3

కం॥ ఒకనాడు నే నిద్రింపగ । ప్రకటితముగ స్వప్నమందు
ప్రత్యక్షంబై సు । దపి నను భజియింపుము అకలంక
వరంబు ఇత్తునంటివి రామా । 4

కం॥ శ్రీ రామ నామ శతకము । ధారుణిలో చెప్పుచుంటి దరి
జేర్చుట కా । భారము నీవె మరియొక । దీరేదు జగంబు
లందు నెరుగను రామా॥ 5

కం॥ శ్రీరామ నామమిప్పుడు । తారకమని భజనచేసి తగ
రక్షించె । భారము నీ దని పలికిన । ఊరక యుండంగ
నీకు యుచితమె రామా॥ 6

కం॥ మాటకు పద్యపు కోటులు । వాటముగా జెప్పుచుంటి
వసుధాస్థలిము । మ్మాటికి రమ్మని పిలచియు । ధాటిగ
వరమీయవయ్య దశరథ రామా । 7

కం॥ వేమరు నా మది లోపల । నీమముతో నిన్ను గొలుతు
నిర్మల మతిచే । కామితములిచ్చి మమ్ముల ప్రేమతొ
రక్షించవయ్య శ్రీరఘురామా॥ 8

కం॥ ఈ రేడు జగంబులలో । వేరే దైవంబు లేదు వెదకి
చూచిన ఓ । పార రహిత కలుషార్ణవ । తారక రక్షించ
వయ్య దశరథరామా॥ 9

కం॥ మాయా అవిద్యలు రెండును । కాయంబున దగిలియుండు
ఘనముగ యెపుడున్ । మాయా అవిద్యల రెంటిని ।
కాయంబున తొలగద్రోయ గదవె రామా॥ 10

కం॥ బిందున నాదము బుట్టెను । కందువతో నాదమందు ఘన
కల బిందువనెన్ । బిందును నాదము కళయును అందముగా
నీవె యున్నది నవనిలో రామా॥ 11

కం॥ అండాండంబులు నీ పని । దండిగ మది తెలిపియుండి
ధరణీ స్థిరి బ్రహ్మాండంబులు నీవే యన । ఖండా ఖండ
ములు లేక గ్రాలెదు రామా॥ 12

కం॥ ఇడయును పింగళయును మరి । తడి యెదమల తిరుగు
చుండు తదురుగ నెప్పుడున్ । నడుమ సుషుమ్నయు నుం
డును తడబడకను చూడవలయు తథ్యము రామా॥ 13

కం॥ కన్నుల నుండె వెలుగె । యన్నియు సత్రేగు నను
అని తెలిసినదే । తన్ను తానెరుగుటెయని మున్నే వచిం
చితివి నాదె మూలమున రామా॥ 14

కం॥ బయలందు బుట్టు సర్వము । బయలందె వృద్ధిఁబొందు
బయలున నణగున్ । బయలే బ్రహ్మము తెలసిన ।
బయలందె ముక్తి కలుగు ॥ బాగుగా రామా 15

కం॥ వేమారు చెప్పితివ్విదు । పామరులకు గట్టిగాను బయలె
బ్రహ్మం । బేమియు లేదని తెలిపిన । కాముకులకు
ముక్తి కలుగదు రామా॥ 16

కం॥ మనసె సర్వ జగంబులు । మనసే మరి మాయ యనుచు
మౌనము తోడన్ । మనసును లేనిది ఆత్మయని మనసందె
తెలియ వలయు । మహిలో రామా॥ 17

కం॥ బిందు త్రయముల యందును । సందముగా బ్రహ్మ
ముండునని విభుధులన్ । ముందున వెదకిన లేదని యం
దరు తెలియంగలేక । యవనిలో రామా॥ 18

కం॥ ఇంటికి లోపల యుండును । కంటికి లోపల యుండు
ఘనముగ నెప్పుడున్ । మింటికి మంటికి వెంటికి అంటియు
మరి నంటకుండు నవనిలో రామా॥ 19

కం॥ అరిషడ్వర్గంబులను । ధర లోపల ద్రోచివైచి । తద్భయు
భక్తిన్ । పరమా ద్వైతం బెరిగియు పరమెప్పుడు
గోచుచుంటి బాసెగ రామా॥ 20

కం॥ దిక్కుల నెల్లను దిక్కై । దిక్కులలో వెదకి చూడ
తేజము తోడన్ । వక్కటియై కనిపించును పిక్కటిల్లుచు
బ్రహ్మ మెపుడు పృథివిలో రామా॥ 21

కం॥ ఇక్కడ నున్నదటంచును । ఇక్కడ లేదనియటంచు
నేర్పడకుంబుదిన్ । యెక్కడ చూచిన బ్రహ్మం । బొక్క
టియై కనుపించు చుండును రామా॥ 22

కం॥ యైదింటి నెరిగియు మరి। వేరొక్కటి నణచి పుచ్చినంతట
నిపుడా। యైదింటిలోని ఇరువై యైదింటికి మీది దాత్మ
యంటుచు రామా॥ 23

కం॥ సారము లేనిది సం। సారము నేనది నమ్మలేక చక్కగ
నీవా। ధారమని నమ్మియుంటిని। ధారుణిలో వరము
నిమ్ము దశరథ రామా॥ 24

కం॥ ఇన్నేల చెప్పవలయును। తన్నే తానెరుగు కొరకు తనకు
అన్యముగా నున్నది అంతా మిథ్యని। కన్నులతో చూడ
వలయు। ఘనముగ రామా॥ 25

కం॥ వేదాంత సారమంతయు। పాడుగనే చెప్పితిపుడు పద్యంబు
లలో। సాధులు తెలిసిందురు ఇది। నాదాంతమే బ్రహ్మ
యనుచు నయముగ రామా॥ 26

కం॥ నక్షత్రమాల చెప్పితి। సాక్షాత్కారంబు గాను చక్కగ
ఇపుడున్। రక్షించి బ్రోవవయ్యా। తక్షణమె మోక్షమిచ్చి
దశరథ రామా॥ 27

కం॥ ధారుణిలో పరశురాముని। సూరయ కవి చెప్పినట్టి శుభ
శతకంబున్। కోరికతో చదువు వారికి। ధీరత వర
మీయ వయ్యా। దృఢముగ రామా॥ 28

॥ నాదాంతమె బ్రహ్మంబను నక్షత్రమాల సంపూర్ణం ॥

# శ్రీరామా షోడశ మహా పూజా విధాన పద్యములు

కం॥ మానసమందున నిన్ను నే నిలిపి పూజసేతు నేయుపుతోడన్
నీ నామ శతము చెప్పుచు దీనుడనని వేడుకొంటి స్థిరముగ
రామా॥ 1

కం॥ ఆవాహన జేసితి నిను । తీవరముగ వచ్చి నన్ను దేవా
ఇప్పుడున్ । పావనునిజేసి పిదపన్ । సేవకునిగ కరుణ
జూడు శ్రీరఘురామా॥ 2

కం॥ ఈ సమయమందె సీతున్ । దాసుర నవరత్న ఖచిత
ఖర్మపు వరసిం । హాసన మిచ్చితి గైకొని ఆసీనుడ
గమ్ము కోర్కెలలరగ రామా। 3

కం॥ ఆద్యంత రహిత అగమ । వేద్యా భయ భక్తి యుక్తి
వినతుడ నగుచున్ । పాద్యం బిచ్చెద గైకొను । సద్య
స్ఫాలంబునందే చక్కగ రామా॥ 4

కం॥ ఇప్పుడు అర్ఘ్యం బిచ్చెద చప్పున గైకొనియు పిదప
దయతో నీవున్ । చొప్పుగ జేసిన శపథము తప్పక మా
కీయవయ్య దశరథరామా॥ 5

కం॥ స్నానము సేయుట కొరకై । నే నిమముతోడ దెస్తి
నిర్మల జలమున్ । స్నానము సేయుము నీవున్ । మానస
మందునను నిన్ను మననము రామా॥ 6

కం॥ దోవతులిచ్చితి నీకున్ । శ్రీవరముగ దాల్చి నీవు దివ్యము
గానున్ । నా వలన నేరమెంచక । కావుము ఈ వేళ
మమ్ము కరుణతో రామా॥ 7

కం॥ యజ్ఞోపవీత మిచ్చితి సుజ్ఞానముచేత నేను సొంపుగ
నిపుడున్ యజ్ఞాధిప గైకొనవే । అజ్ఞానతమోర్క రూప
హరి శ్రీరామా॥ 8

కం॥ ఉంగరములు పోగులకును రంగుగ రత్నాలు చెక్కి
రమ్మని నీకున్ బంగారు సొమ్ములెల్లను । సింగారించి
తిని నేను సీతారామా॥ 9

కం॥ శ్రీ గంధం బిచ్చితినే । వేగిరమే తీసుకొనియు విమల
ముగానున్ । నాగరికంబున శుభమున । బాగుగ ధరి
యించు పతిత పావన రామా॥ 10

కం॥ చంగల్వలు చామంతులు । సంగతిగా కోసితెచ్చి చక్కగ
ఇపుడున్ । బంగారు గిన్నె నిడుకొని । పొంగుచు నే
పూజ సేతు పొందుగ రామా॥ 11

కం॥ ధూపం బాఘ్రాణింపుము । దీపము ధరియింపు నిత్య దివ్యము
గానున్ । తాపత్రయముల బాపియు । చేపట్టుము నన్ను
నీవు సీతారామా॥ 12

కం॥ సన్నని వెయ్యేపు అన్నము । పన్నుగ ఘృత సూప శాక
భక్ష్యమ్ములతో । విన్నపముజేసి ఇచ్చితి తిన్నగ భక్షించ
వయ్య స్థిరముగ రామా॥ 13

కం॥ ఇచ్చితి తాంబూలంబు । వచ్చ యాకులును మిగుల పం
డని పోకల్ । మెచ్చిన యాలకి కాయలు। తెచ్చితి గైకొ
నుము నీవు స్థిరముగా రామా॥ 14

కం॥ కర్పూర హారతి ఇచ్చితి । మెప్పుగ దర్శించి నీవు మేదిని
మీదన్ । గొప్పగ సిరి సంపదలను । తప్పక మాకీయ
వయ్య దశరథరామా॥ 15

కం॥ హరి హారంబిద్దరు నీకే। గురుతవునీ వేయటంచు గొప్పగ
నిడుదున్ । మురియుచును మంత్రపుష్పము । శిరమున
ధరియించవయ్య శీతారామా॥ 16

కం॥ నిత్యము ఛత్రము చామర మత్యున్నతమైనయట్టి ఆందోళి
కమున్ । నృత్యము గీతము వాద్యము । సత్యముగా చేసి
నాడ చక్కగ రామా॥ 17

కం॥ సాష్టాంగ నమస్కారం । బిష్టముగా చేసినాడ ఇప్పుడు
మాకున్ కష్టములన్నియు మాన్పియు । స్పష్టముగా
మోక్షమిమ్ము స్వామీ రామా॥ 18

కం॥ షోడశ పూజలు చెప్పితి । నాడును నేడనక ప్రతి దినం
బును వినినన్ వేడుకతో వ్రాసిచదివిన వారికి మోక్షంబు
వచ్చు వసుధలో రామా॥ 19

షోడశ మహా పూజా విధానము సమాప్తం.

# అచలబోధ

గీ॥ అప్ప గురునకు మ్రొక్కి నే । జెప్పనెట్టి । గీత పద్యము
లెఱువడైన । కీర్తి వెలయ । చదువ దొరకును ముక్తి
ని । శ్చయముగాను । పరశు రాముని సూరయ । భావ
మిదియె॥ 1

గీ॥ తనువు మనసు ధనమును । ధారబోసి । గురువునకు సేవ
నెప్పుడు। కూర్మితోను। భక్తి చూపిన ముక్తిని । బడయ
వచ్చు । పరశురాముని సూరయ । భావమిదియె 2

గీ॥ సాధన త్రయమంతయును వదలిపెట్టి । నిర్వికల్ప సమా
ధిని । నిలచియున్న । వారి కెప్పుడు దగ్గును । పరమ
పదము పరశురాముని సూరయ। భావమిదియె॥ 3

గీ॥ బట్టబయలేమి చేసిన్నను । భ్రాంతిబోవ । బోయినప్పుడె
మోక్షంబు । పొందవచ్చు ఇంత కంటెను గురువాక్య ।
మెందు లేదు। పరశురాముని సూరయ। భావమిదియె॥ 4

గీ॥ శుష్క వేదాంతములు కొన్ని । సూటిగాను । చెప్పుచుం
దురు అర్థముల్ గొప్పగాను । చెప్పినంతనె మోక్షము ।
చేరువౌనె । పరశురాముని సూరయ । భావమిదియె 5

గీ॥ బయలె పరమాత్మ యంచును । పలుకుమాట మనసు నం
దున దృఢమైన మానవులకు । పాప కర్మంబులన్నియు ।
బాసిపోవు। పరశురాముని సూరయ। భావమిదియె॥ 6

గీ॥ ముందు గురునకు మ్రొక్కనే । మోదమలర । చూచి
చెప్పితి జగమెల్ల । సత్యమనుచు । బ్రహ్మమెప్పుడు
బయలంచు । బాగుగాను । పరశురాముని సూరయ । భావ
మిదియె॥ 7

గీ॥ చిన్నగాజేతు నే నొక విన్నపంబు । భ్రాంతి బోగొట్టి
బయలందె॥ భావమునంచి ముక్తి చెందంగ వలయును
మోహమణచి। పరశురాముని సూరయ। భావమిదియె॥ 8

గీ॥ బ్రహ్మమనగను బయలంచు పరగతెలసి । కన్నులను
జూచి నీవును । ఘనతమీర నున్న మోక్షంబు సిద్ధించు
నుర్వియందు। పరశురాముని సూరయ భావమిదియె॥ 9

గీ॥ గంటు మాటలవల్లనె । కలదె ముక్తి॥ ఇంటనుండక దేశిక
వెంటదగిలి । తిరిగి మోక్షంబుజెందు మీ । తెలివిగలిగి
పరశురాముని సూరయ భావమిదియె 10

గీ॥ కన్నవారెల్లకు మొక్కిన కలదె ముక్తి। యున్నదనుకొందు
రజ్ఞాను లుర్విలోన దేశికులు పల్కుచుందురు తేటపడగ
పరశురాముని సూరయ భావమిదియె। 11

గీ॥ భ్రాంతులుడిగిన బ్రహ్మంబు । బట్టబయలు । దీని నెరిగిన
వారికి । దేహిలేడు । దేహమెప్పుడు లేదని తెలియవలయు
పరశురాముని సూరయ । భావమిదియె ॥ 12

గీ॥ ముద్రలొక కొన్నిబట్టుచు మురియుచుండ్రు । మాయసత్యము
గనిపించు । చోద్యములును కన్నయంతనె మోక్షంబు కల్గ
దయ్యె పరశురాముని సూరయ । భావమిదియె ॥ 13

గీ॥ కర్మములజేసి కొందరు । గతిగాను । ముక్తిగాంతుమటం
చును । మురియుచుండ్రు । ముక్తియనగనె గంపెడు ముల్లె
గాదు । పరశురాముని సూరయ భావమిదియె ॥ 14

గీ॥ గురుని ఉపదేశమునగాని । కుదురదయ్యె । దాని చెప్పు
రెప్పుడు । దాగుగాను । బ్రహ్మబోధ రహస్యంబు బయల
టంచు పరశురాముని సూరయ । భావమిదియె । 15

గీ॥ గురునివాక్యంబు మనసున । కుదురుపరచి । బయలుబ్రహ్మ
మటంచును పలుకవలయు । పలికినప్పుడె ముక్తియు ।
బయటపడును పరశురాముని సూరయ భావమిదియె 16

గీ॥ కామమార్గములన్నియు । కట్టిపెట్టి । పరమపదమైన మార్గము
పట్టవలయు । పట్టినంతనె మోక్షంబు । బయలుపడును ।
పరశురాముని సూరయ । భావమిదియె ॥ 17

గీ॥ బట్టబయలేమిలేదని। గట్టిగాను। అప్పగుడదనె మున్ననే।
చెప్పితిపుడు। దీని నెరిగిన జన్మముల్। తిరిగిలేవు।
పరశురాముని సూరయ। భావమిదియె॥ 24

గీ॥ శిష్య బోధకు పద్యముల్। చెప్పితిపుడు। వ్రాసి చదువుచు
వినుచున్న। వారికెల్ల। బంధమోక్షములన్నియు। బాసిపోవు।
పరశురాముని సూరయ। భావమిదియె॥ 25

శ్రీమత్ పరశురామ వంశోద్భవ శ్రీ నారసింహ్మదాసు

శ్రీ సీతారామయ్య గార్ల

సోదరుడగు శ్రీ సూరయ్య

విరచిత పద్య రత్నావళి

సమాప్తము.

శ్లో॥ యస్యాంతర్నాది మధ్యం । నహి కర చరణం నామగోత్రం । న సూత్రం । నో జాతిర్నైవ వర్ణో న భవతి పురుషో । నా నపుంసో । న చస్త్రీ నాకారం నో వికారం । నహి జననమరణం । నాస్తి పుణ్యం । న పాపం । నో తత్వం తత్వమేకం । సహజ సమ రసం । సద్గురుం తన్నమామి ॥

# అచల గురు జండాతత్వము

అచల గురు జండాకు వందన మనుడీ, అచల గురు మందిరమున నుందమురాండీ। వచన రహిత బ్రహ్మ మనీ। వచనమే ఓంకారమని। వచియించిన మెరుక తనలో। వచ్చి పోవుటెరుకలేని ॥ ౧ ॥ దేహ మనెటి కర్ర బట్టి। సోహం సూత్రమునను గట్టి ఆహామతో బట్టె గురవేయ। అహాములేక నలరు జండా ॥ ౨ ॥ మెగువ దిగువ లనెటి మనకు। పైన నుండి పలుకకుండ। దిగువనున్న వారి కచల ధీక్ష నొసగుచున్న జండా ॥ ౩ ॥ వకటికి మొదలొకటిలేని దొకచే సకలంబు సకల। మొకటి మూల మొక పెరి గిన। వకటి రెండొకటనకయున్న ॥ ౪ ॥ అచల గురుని ఆశ్రయించి అచల బోధనాలకించి। విశయరహితమైన వారి। కిహ పర సుఖ భ్రమలబాపె ॥ ౫ ॥ అచల గురు పరంపరా। ఆచార్యులైన సిద్ధారాముడ। చంద్రభక్త వరులకతని హస్తమునను అందించిన ॥ ౬ ॥ అందుకున్న భక్త జనులందరితో సాయిదాసు। అంది పొంది అచలా ఆనందమునను హాయిజెంద ॥ ౭ ॥